# మీ ఉత్తరాలు పెందరాళే బట్వాడా చేస్తాము



సూర్యనారాయణగారు,
ధీ నగర్,
విజయవాడ 2

## చిరునామాతో
# జోన్ నెంబరు
## వ్రాయండి

పెదపెద్ద నగరాలు అనేక తపాలు బట్వాడా జోనులుగా విభజింపబడ్డాయి.

జోన్ నెంబరునుబట్టి సార్టింగు వికేంద్రీకరింపబడి, మీ ఉత్తరాల బట్వాడా త్వరగా జరుగుతుంది.

జోన్ నెంబరు పైన వ్రాసి వున్న తపాలు తిన్నగా ఆ బట్వాడా జోనుకే పంపబడుతాయి.

జోన్ నెంబరు వ్రాసిలేని తపాలుకు సార్టింగు నిమిత్తం వ్యవధి పడుతుంది కనుక బట్వాడా ఆలస్యం కావచ్చును. మీ వూళ్ళో తపాలు బట్వాడాకు జోనులు ఏర్పడివుంటే, మీకు జాబులు వ్రాసేవారికి మీ చిరునామాతోబాటు ఆ జోన్ నెంబరుకూడా వ్రాయమని తెలియజేయండి.



## మీ సౌకర్యంకోసం మాతో సహకరించండి

తంతి, తపాలా శాఖ

DA

జయంతి తే సుకృతినో
రససిద్ధాః కవీశ్వరాః.



సంపాదకులు :
విశ్వనాథ సత్యనారాయణ
జువ్వాడి గౌతమరావు

సంవత్సర చందా 8-00
విడిప్రతి 75 న. పై.

# సంపాదకీయము

సంస్కృత భాషయొక్క నేటి భారతదేశములోని పరిస్థితినిగూర్చి యెంతైన వ్రాయవలసియున్నది. ఈరోజులలో ఎప్పుడో యొకప్పుడు ఎవ్వడో యొకడు వానికిష్టమువచ్చిన మాటలు సంస్కృతభాషనుగురించి మాటాడుచుండును. ఈ మాట లోకవిధముగా నుండవు. అన్నింటిలో పరమ విపరీతమైన భాషణ మెట్టిదనగా సంస్కృతభాషయొక్క రోజులు గడచిపోయినవి అనియు తదభిమానులను గురించి వీరిమాట లింకసాగవనియు వీరి పప్పులింక నుడుకవనియు మొదలైనమాటలు వారిట్లనుచు మరియు నొక్కటి యందురు. మాకు సంస్కృత భాషయందు గౌరవము కలదు కాని ఆరోజులు పోయినవి అని. ఇది యెట్లుండుననగా వృద్ధుడైన తండ్రినిగూర్చి పరులతో గౌరవముగా మాటాడుచు నింటిలో దినదినము వానిని నిందించుచు వాని కన్నము పెట్టక వానిమీద విసిగికొనుచు ప్రవర్తించుటవంటిది. ఆ తండ్రి సంపాదించిన యాస్తి తినుచునే యుండును. ఆ తండ్రికి కుమారుడు గనుక పిత్రీయమైన యాస్తికి నా కుటుంబ గౌరవమునకు నా తండ్రి కడుపున పుట్టుటచేత చదువవలసిన చదువు సంఘములోని మర్యాద తెగిన సంబంధము వచ్చుట మొదలైన సర్వవిషయములయందు తా నధికారియై ఈ స్థితికి వచ్చినాడు. ఒక కూలి చేయువాని కడుపున పుట్టినచో నొక దొడ్డియూడ్చువాని కడుపున పుట్టినచో నొక కిరాతుని కడుపున పుట్టినచో వీనికా సంఘమర్యాద లేదు. వీనికి పదివేలు కట్నమువచ్చు సంబంధమురాదు. తండ్రి గొప్ప కవి ఇతడును కవియే. తాను మహాకవియని యనిపించుకొనుటకు కారణమేమి ? ఆ తండ్రి. ఆ తండ్రి కుమారుడగుటచేత తాను చిన్నప్పుడే గొప్ప కవి యనిపించి కొనినాడు. ఇతరులు వారి తండ్రులు పెద్దకవులు కాకపోవుటవలన నింతటి ప్రతిష్ఠ తెచ్చుకొన లేకపోయినారు. ఇన్నేల వ్రాయుట యనగా మన మందరము తాత తండ్రుల ప్రతిష్ఠలమీద బ్రతుకుచున్నాము. ఆ కుటుంబములలో నా వంశములలో నా వర్ణములలో జన్మించుటచేత తత్తదనుకూలమైన మర్యాదాప్రతిష్ఠలకు వారసులమైనాము. మనకు నేడు వేయి రూపాయల యుద్యోగము వచ్చినదనగా పెద్దచదువుచదువుటకు చదివించుటకు యోగ్యమైన యాస్తిగల మర్యాదగల కుటుంబములో పుట్టినాము కనుక. ఈ సంగతి మరచిపోయి యకాండతాండవము చేయుదురు. సంస్కృత భాషా విషయములో నాధునికులు మాటాడు వైఖరి యంతయు సరిగా నిటువంటిదే. ఏమియును తేడా లేదు.

సంస్కృత భాషవలన వృద్ధిపొందిన నాగరకతికల దేశములో మనముపుట్టితిమి. మనము దైనందినముగా మాటాడు సర్వశబ్దములు లోకోక్తులు దేశీయములైన పలుకుబడులు తెచ్చికొను పోలికలు సామెతలు శాస్త్రములు (శాస్త్రములనగా తర్క వ్యాకరణాదులు కాదు. మనము మాటాడుకొనుచు ఏదో శాస్త్రము చెప్పినట్లుగా అందుము. ఇచ్చట శాస్త్రమనగా నొక సామెతయో ఒకపూర్వకథయో యని యర్థము) ఇవి యన్నియు మనకు మనదేశము ప్రసాదించిన జీవనయాత్రా పరికరసంభారము. ఈ సంభారము లేకుండ మన మెవ్వరము బ్రతుకలేము. ఇతరులతో మాటాడలేము. వ్యవహరించలేము. ఏ దేశములోనైన నింతే. ప్రతి దేశములోనను వేలయేండ్లు బ్రతికిన యా దేశములోని పూర్వుల మహానుభవముచేత ఘనీభ

వించి పరంపరయా లబ్ధమైన ఈ సర్వసాం
ఘిక మత సంబంధ రాజకీయ పౌరాణిక
విజ్ఞానమును చెప్పు సర్వశబ్ద సముదాయము
వాడుకొనుచుందురు. లేనిచో బ్రతుకు లేదు.
ఇట్టి సంపత్తి యేదేశమునకు లేదో ఆ దేశ
ప్రజలు అనాగరకులు. ఆటవికులు. వారికి
సమృద్ధమైన సమస్త విజ్ఞాన శాఖా సంబంధ
మైన శబ్దజాలము లేదు. వారి జీవితమునందు
నాగరకతా లక్షణము లేదు. పాశ్చాత్యులు
నాగరకు లేలయైరనగా గ్రీసు దేశము రోము
సామ్రాజ్యము వారికి తగినంత విజ్ఞానమును
బోధించు శబ్దములును తద్గత భావములును
చేసిపెట్టినది. గ్రీసు రోములు వెనుక లేనిచో
ఫ్రాన్సు, స్పెయిను, ఇంగ్లండు మొదలైన
దేశము లనాగరిక దేశములు. అందుకనియే
వారి యేశాస్త్రమును ప్లాటోతోనో అరిస్టా
టిలోనో ప్రారంభించును. గ్రీకు నాటకకర్త
లతో ప్రారంభించును. హోమరుతో ప్రారం
భించును. తరువాత తరువాత జర్మనీలో
ఫ్రాన్సులో ఇంగ్లండులో అమెరికాలో తత్త్వ
వేత్తలు బయలుదేరినను, ఆ గ్రీసు రోము
దేశపు తత్త్వవేత్తలువేసిన పునాదులమీదనే
వారి తత్త్వశాస్త్రము వృద్ధిపొందినది. నిన్న
మొన్నటిదాక శాంతాయనవరకు అమెరికా
లోని తత్త్వశాస్త్రముకూడ రోము వేసిన
పునాదులమీదిదే. అమెరికా తత్త్వ
శాస్త్రవేత్తలని పిలువబడు నిద్దరు
ముగ్గురు తాత్త్వికులను మినహాయించినచో
పాశ్చాత్య తత్త్వశాస్త్రగతి సర్వవిజ్ఞానము
గ్రీసు రోము పీఠికలమీదనే నడచినది.
యూరపులో గ్రీసు రోములు సంపాదించి
పెట్టిన విజ్ఞానమును కాదనరు. దానిని తిరస్క
రించరు. ఆ పూర్వులను వెక్కిరించరు. వారి
రోజులైపోయినవనరు. వారి పప్పు లుడుక
వనరు. యూరపులో పలుదేశములున్నవి.
నేటి యూరపులో గ్రీసుదేశమునకు ప్రాధా
న్యములేదు. రోమునకులేదు. రోమునగర
ప్రాధాన్య మంతరించి యెన్నివందల యేండ్లో
యైనది. ఆ ప్రాధాన్య మిటలీదేశము సంపా
దించుకొనలేకపోయెను. రాజ్యముయొక్క
సైనికబల దృష్ట్యా ఇటలీకి ప్రాధాన్య మెప్పు
డును లేదు. నెపోలియ నన్నాడట "ఇటలీ
మనకు విరోధియైనచో వాని నెదిరించుటకు
మనకు పదివేల సైన్యము చాలును. ఇటలీకి
మన స్నేహమున్నచో వాడు తెచ్చు తగవులు
తీర్చుట కేబదివేల సైన్యములు కావలయు"
నని. ముసలోనీ దినములలో ఇటలీ ఇంగ్లండు
మీద యుద్ధమును ప్రకటించెను. పార్లియ
మెంటులో నవ్వారట. ఇటలీ దేశస్థులనగా
యూరపు దేశమునకు వంటచేసెడివారు. ఈ
వంటచేసెడివారిజాతి యుద్ధము ప్రకటించుట
యేమిటని. అందుచేత రోమునకు ఇటలీకి
సంబంధము లేదు. రోములో వృద్ధిపొందిన సార
స్వతాది విషయములు యూరపు నాగరకతకు
పునాదులు. దానిని కాదనరు. గ్రీకు లాటిను
భాషలకు మర్యాద నేటికిని పోలేదు. ఇట్లుం
డగా మనదేశములోని యువకులును ఆభాస
యువకులును సంస్కృత భాషనుగూర్చి యథే
చ్ఛముగా మాట్లాడుట యెందులకు? సంస్కృ
తపురోజులు పోయినవనగా వారి యుద్దేశమేమి?
ఇంగ్లీషు రోజులు వచ్చినవనియేగదా ? ఇంగ్లీ
షురోజులు వచ్చినవనగా నర్థమేమి ? ఈ
మాటకు వట్టి భాషయనియర్థమా. ఈ రెండు
భాషలు నే భిన్న నాగరకతలను పోషించుచు
న్నవో ఆ నాగరకతలయొక్క ప్రాధాన్య
వివక్షచేత నన్నమాటలా ? నాగరకతా
ప్రాధాన్య వివక్షచేత నన్నమాటలే. ఈ సం
గతి యందరకు తెలియదు. వారు విస్పష్టము

గా ననరు. సంస్కృతభాషకు రోజులు పోయి ననుటకు బదులు సంస్కృత భాషాగత నాగరకతా దినములు పోయినవి యని వారన్నచో వారి భావము చక్కగా తెలియును, వారట్లనరు. ఎందుకననగా కొందరిని మోసముచేయుట కొరకనరు. లేదా వారికే తమకు తెలియదేమో! కాని దాని యర్థమిది. ఇది వట్టి భాషావిషయికమైన వాక్యముకాదు. భాషావిషయికమైన వాక్యమైనచో వారు చెప్పినదానిలో కొంత యర్థమున్నది ఎందుకనగా సంస్కృతభాష నేడు దేశములో నెచ్చటనున్నది? విశ్వవిద్యాలయములలో దానినెన్నివిధముల నాశనము చేయవలయునో నన్నివిధముల నాశనము చేయుచున్నారు. ఈ లెక్కప్రకారము ఈ విశ్వవిద్యాలయములిట్లే జరుగుచున్నచో మరికొన్నాళ్ళకు సంస్కృతభాషయే ఉండదు. విశ్వవిద్యాలయములో సంస్కృత పీఠముండును. ఆచార్యుడుండును. గుజ్జును గ్రుడ్డిదైనను దానాకు తక్కువలేదని వాసికిని వేయి రూపాయిలే జీతము. ఆ తరగతిలోని విద్యార్థులు రెండున్నర మూడు ముప్పాతిక. కొన్నాళ్ళక్రింద నొక విశ్వవిద్యాలయాధ్యక్షు లన్నారుగదా 'మా విశ్వవిద్యాలయములో ఆంధ్రశాఖలో సంవత్సరమునకైదారుగురికన్న నెక్కువయుండరు. నిజమే అయినను మన మాతృభాషయందలి గౌరవముచేత మేము దానిని నిలబెట్టుచున్నాము' అని. నేడింకొక విశ్వవిద్యాలయములో, భగవంతుని ధనముతో నడుపబడుచున్న విశ్వవిద్యాలయములో, సంస్కృతమేలేదు. ఎవరైనను సంస్కృతము చదివెదమని వచ్చినచో నెందుకురా నాయనా మేము మీకు ఫస్టుక్లాసు ఇవ్వము. నీకుద్యోగమురాదు అనికూడ యందురేమో తెలియదు. ఆ పెద్ద లట్లనరుకాని అన్నచో పెద్ద దోషమున్నదని యనుకొన నక్కరలేదు. కనుక వట్టి భాషాదృష్టిలో చూచినచో సంస్కృతపు రోజులు పోయినవి అని యనవచ్చును. ఈ యనుట కర్థమేమనగా నేడు చదువనగా విశ్వవిద్యాలయముల చదువేకనుక విశ్వవిద్యాలయములలో సంస్కృతమునకు స్థానము లేదని యర్థము. విశ్వవిద్యాలయములలో సంస్కృతపీఠ ముండుటయు దానికొక యాచార్యు డుండుటయు మర్యాద గనుక నుండురు. తదనుబంధి కళాశాలలలో కొన్నింటిలో నొక్క సంస్కృత విద్యార్థి కూడ నుండడు. ఎవడో సంస్కృతోపన్యాసకుడుండును. వాడు తన యుద్యోగము పోవునని ఎవనికో ఉపకార వేతనము లిప్పించి విద్యార్థిగా ఏర్పరచుకొనును.

ఆ విశ్వవిద్యాలయములో తెలుగు విద్యార్థులను కొన్నాళ్ళట్లే చేర్చికొనవలసి వచ్చెనని వినికిడి. ఈ దృష్టితో సంస్కృతపు దినములు పోయినవి. నిజముగా విచారించినచో పోలేదు. ఏలయనగా విశ్వవిద్యాలయములలో ప్రధానముగా చెప్పబడునది ఇంగ్లీషువిద్య. మనకు స్వరాజ్యము వచ్చినతరువాత నింగ్లీషు చదువుకొనుచున్నవారి సంఖ్య పెరిగినదేమో చెప్పలేము. (తప్పకుండ పెరిగియుండును. ఎందుకనగా మనకు స్వాతంత్ర్యము రాకముందు ఇంగ్లీషుభాష మనకు పనికిరాదని ఘోషించిన పెద్దలు నేడు దానిని వదలినచో బ్రతుకలేమనుచున్నారుకదా! కొందరు దేశనాయకుల యౌవనమువలె దీనియాయుర్దాయము పెరుగుచున్నది. స్వరాజ్యమువచ్చిన మొదటి దినములలో నైదేండ్లలో నింగ్లీషుపోవుననిరి. అది పదేండ్లయినది. మరల నింకొక యైదేండ్లు జరిగినది. ఇప్పుడు దానికి మార్కండేయా

యుస్సు పట్టినది) ఈ స్వరాజ్యము రాని రోజులలో విద్యావంతుల (అనగా ఇంగ్లీషు చదివినవారే) సంఖ్య నూటి కారో యేడో. ఆ రోజులలోనింగ్లీషువాని పరిపాలనము క్రింద మన దేశములో విద్యాభివృద్ధి జరుగుట లేదని వాడు వెళ్ళిపోవలసిన యవసరమున్నదని చూపించిన కారణములలో నొకటిగా భిన్న దేశములయందలి విద్యావంతుల సంఖ్య నూటి కింతయని పట్టిక తయారుచేసి చూపింపబడెడిది. ఇగ్లండు జపాను అమెరికా మొదలైన అన్ని దేశములయందు విద్యావంతుల సంఖ్యనూటికి తొంబదిదాటి యుండెడిది. మన దేశములో విద్యావంతుల సంఖ్య మాత్రము నూటికి పది మించిన పాపాన నెప్పుడుపోలేదు. మనమా సంఖ్యనే తీసికొన్నచో విద్యావంతులనగా నింగ్లీషు చదివినవారు గనుక వారి సంఖ్య నూటికి పది యుందము. విశ్వవిద్యాలయములలో బోధింపబడని సంస్కృతభాష చదివిన వారి సంఖ్య నూటికి మన దేశములో నెప్పుడును ఆ రెడునకు తక్కువుండదు. వేదము చదివినవారు శాస్త్రములు చదివినవారు, కావ్యములు చదివినవారు తమంతట తాము సంస్కృతము చదువుకొన్నవారు వీరిసంఖ్య మన దేశములో నెప్పుడును తక్కువ లేదు. వారి సంఖ్యకు విశ్వవిద్యాలయములకు సంబంధము లేదు. సంస్కృతభాష యుద్యోగములకొరకు చదువరు. సంస్కృతభాష నీ దేశములో సంస్కృతభాషకొరకే చదువుదురు. వేదము చదివెడువారున్నారు. ఘనపాఠీలున్నారు. వారుద్యోగములకొరకు చదువరుకదా! నిజమైన చదువుద్యోగముకొరకెవ్వడును చదువడు. ఈ దేశములో చదువనగా వేదశాస్త్రములు. తక్కినవి పొట్టకూటివిద్యలు, పొట్టకూటి విద్యలు చదివిన వారుద్యోగములు చేయుదురు. దేశమును పాలింతురు. సృష్టిని తామే చేసితిమని తాండవించుచుందురు. వేదాదివిద్యలు రాజ్యమును పాలించుటకొరకు చదువరుకదా! ఇప్పుడు కాదు పూర్వమును చదువలేదు. ఈ వేదశాస్త్రములను చదువుట నీ దేశములో నెవ్వరును మాన్పించలేరు. మూడు వేల యేండ్లు బౌద్ధమత మీ దేశములో విజృంభించి వేదశాస్త్రములను చంపుటకు సర్వదా ప్రయత్నించినది. ఇప్పుడు మన ఇంగ్లీషు నాగరకత యెన్ని వేషములు వేయుచున్నదో ఎన్ని పన్నాగములు పన్నుచున్నదో ఎన్ని బౌద్ధపు టెత్తులు వేయుచున్నదో ఎన్ని యబద్ధములు చెప్పుచున్నదో తదభిమానుల జీవితములను పాడుచేయుటకెంత ప్రయత్నించుచున్నదో అన్నియును బౌద్ధమతము రాజాశ్రయమవలంబించి ప్రజాబాహుళ్యమును తనవైపునకు త్రిప్పికొని యాశినది. ఆ వేదశాస్త్రములు చావలేదు. తరువాత క్రీస్తుశకము పదకొండువందల తొంబది మూడులో మహమ్మదు గోరీతో తురకలరాజ్యము వృద్ధిపొందినది. కాదంక కొంత పూర్వకాలమునుండియే యుండెను. ఒక వేయియేండ్లు తురక లీదేశమును పాలించిరంనము. వారు మన మతమును సర్వథా నాశనము చేయుటకు పలు క్రూరకృత్యములు చేసిరని చరిత్ర చెప్పుచున్నదిగదా! హస్తినాపుర హిందూప్రజలు ఎన్ని సార్లు చిత్రవధ చేయబడిరో చెప్పలేము. ఊళ్ళు పేళ్లు మార్చిరి. దేవాలయములను ధ్వంసము చేసిరి. వానిమీద మసీదులను కట్టిరి. వేయియేండ్లంత చేసినను ఈ వేదశాస్త్రములు చావలేదు. రెండువందల యేండ్లక్రింద నింగ్లీషువాడు వచ్చెను. అదేమి యిదేమియని వాడు తన విద్యకు విశ్వవిద్యాలయములు

పెట్టెను. మనల నందరిని తయారు చేసెను. ఆ వేదశాస్త్రములు చదివెడివా రుద్యోగము లక్కఱ లేనివారు. రాజ్యములు పాలించవలె నన్న యాశ లేనివారు. పత్రికలలో ప్రచారముచేసి ఏదోయొక్క సిద్ధాంతమున కొమ్ము కెక్కింతమనుకొనివారు. ఒక వంక డొక్క మాడుచున్నను వేదశాస్త్రములను చదివి తీరవలయు ననుకొనెడివారు. రూపాయి సంభావనకోసము వేదశాస్త్రములు నిలబెట్టెడి మహా ప్రభువులు. భగవంతునిచేత నిర్మింపబడిన వేదములను, ఋషికల్పులైన మహానుభావులు వ్రాసిన శాస్త్రములను, ఉపనిషద్రహస్యములను, నిలబెట్టుటయే ఆ విద్యలను చదువుటయే తమ బ్రదుకు పరమార్థమనుకొనువారు. ఈ దేశమునందు ఇట్టి ఇంగ్లీషు నాగరకతా తరంగములు వందవచ్చినను పుట్టుచునే యుండును. కాశ్మీరదేశ చరిత్రలో నొక చమత్కారమైన కథయున్నది. ఒక తురుష్కదేశపు సుల్తాను కాశ్మీరదేశము నాక్రమించి ఆనాడు కాశ్మీరదేశములోనున్న ఏబదివేల పండితులను చేతులకు సంకెలలు వేసి తన దేశమునకు అఫ్ఘనిస్థాన్ దేశములోనుండి తీసికొనిపోయెను. ఆ యేబదివేలమందియు దారిలోననే మరణించిరి. ఒకనాడు కాశ్మీరదేశము సంస్కృత భాషకు పుట్టినిల్లు. శంకర భగవత్పాదులు శారదాపీఠము నచ్చటస్థాపించిరి. పాణిని పతంజల్యాదు లచ్చటి వారే యందురు. అభినవ గుప్తపాదు డచ్చటి వాడు. అచ్చటినుండి ఏబదివేలమంది పండితులను తొలగించినచో సంస్కృత భాషను భారతదేశమునుండి నిర్మూలించితి ననుకొన్నాడా సుల్తాను. నేటి నాగరకత యంతకన్న నెక్కువ చేయలేదు. మన నాగరకతయు మన ప్రజాస్వామికమును సంస్కృత భాషాభిమానులకు తిండిలేకుండ చేసిన చేయవచ్చును గాని వారిని బంతులుదీర్చి నిలబెట్టి నరకుటకు ఇండియన్ పీనల్ కోడ్ ఒప్పుకొనదు. వేదములను శాస్త్రములను నిర్మించిన భగవంతుడు తన స్వరూపమును తానే నిలబెట్టుకొనును. అందుచేత నా వేదశాస్త్రములను చదివెడి వారిని తాను సృష్టించుకొనును. యూరపులో కొన్ని వందల యేండ్లుగా యూదుజాతిపొందిన కష్టములెట్టివి? ఆ దేశములలో మధ్యయుగములో యూదులు వడ్డీవర్తకము చేసెడివారన్న కోపముతో ధనవంతులైన యధికారులైన క్రైస్తవులు వారిని చేసిన చిత్రహింసలకు హద్దేమైన నున్నదా? నిన్న కాక మొన్న హిట్లరు యూదుజాతిని జర్మనీలో నేమిచేసెను? ఆ జాతి నశించిపోయెనా? హిబ్రూభాషను చంపగలిగిరా? ఇట్టి కృతఘ్నులైన యూరపు నాగరకతకు యూదుజాతి ఏమిచేసినది? మహర్షి కల్పుడైన ఐన్‌స్టైనును సృష్టించి యిచ్చినది. కనుక మహానుభావులారా! ఏ నాగరకతలో నేమియున్నదో ఏ జాతిలోనే యంతశ్శక్తి ఇమిడియున్నదో మనకు తెలియదు. భగవంతునకు తెలియును. అతడు కాలస్వరూపుడు. మన కెవరితోడనో విరోధముండదు. వాడు సంస్కృతాభిమాని అందుచేత సంస్కృతము నశించిపోవలయు ననగూడదు. ఆరోజులు పోయెననకూడదు. తెలంగాణాలో ఉరుదూ రోజులు పోయినవి. పది యేండ్ల క్రింద తెలంగాణాలో నొక ఉర్దూ పండితుడు ఒక ఉర్దూ భాషాభిమాని, యొక ఉస్మానల్ ఖాన్ ప్రభుభక్తుడు. తెలంగాణాలో తెలుగు రోజులుపోయినవని యుండవచ్చును. అతని మాటలలోని యాథార్థ్యము నేడు తెలియును. అప్పుడు సర్వ భారతదేశమునుర్దూమయము చేయవలయునని

భావింపబడి యుండవచ్చును. అట్లు జరుగ లేదు. అంతకంటె నెక్కువమేర నెక్కువ కృతకత్వముతో నింగ్లీషు నేడు రాజ్యముచేయుచున్నమాట నిజమే. దీనికి శాశ్వతత్వమున్నదని యెనడనుకొనును. ఇంగ్లీషువాడిచ్చట రాజ్యముచేసినపుడు తనది సూర్యుడస్తమించని రాజ్యమను కొనెను. మనచేత ననిపించెను. వాడుకట్టిన కలెక్టరాఫీసులు చూచి నచో వాడిచ్చటనుండి వెళ్ళిపోవలసి వచ్చునని వాడనుకొన్నట్లు తోచదు. అంత పెద్ద పెద్ద కొండరాళ్ళతో కట్టుచుండగా వాడిచ్చటినుండి వెళ్ళిపోవునని మనమనుకొనలేదు. పైగా వానిని మనము నిజముగా వెళ్ళగొట్ట లేదు. వాడికే సిబ్బందితక్కువై లేచిపోయెను. ఆ ఇంగ్లీషుభాష మిగిలినది. ఇది యిచ్చట శాశ్వతముగా నుండుననుకొనెడివారు ఆ ఇంగ్లీషువానికన్న గొప్పవారా? వీరు వాని మానసిక సంతానమేకదా? ఔరసునకు లేదు. మానసికునకేమి యాధిక్యము? ఇది యంత యువట్టి భాషా విషయము. సంస్కృతపు రోజులు పోయినవి అన్నమాటలో నట్టిభావ చదివెడువారు లేరనియర్థమైనచో ఆ యర్థము నిజముకాదని చెప్పుటకు వ్రాయబడినది. వెనుక నున్న నాగరకతయని యర్థముకావచ్చును.

ద్రావిడభాషా కుటుంబబుద్ధ్యా అరవము తెలుగు మొదలైన భాషలు సంస్కృత జన్యములు కావని చెప్పుచున్నారుకదా? ఈజిప్పులో కొన్ని పలకలమీద నొక భావమున్నదట. కాల్డ్వెల్ వానికిని అరవము తెలుగు మళయాళము మొదలైనవాటికిని సామ్యమున్నదని యొకవాదము లేవదీసెను. ఈయర్థములో సంస్కృతపు రోజులు పోయిననవనికావచ్చును. ఎందుకనగా ద్రవిడకజగం విజృంభించి అరవలబాస సంస్కృత భాషకంటె పూర్వమని వెలయించుకొని తాను విజృంభించునేమో అన్నయర్థము కావచ్చును. ఇట్లు మరికొన్ని యర్థములు కావచ్చును. మేమూహించ గలిగినన్ని యర్థములకు, — లేదా సంస్కృతపు రోజులు పోయినవనువారు మరియు నెక్కడనో మెప్పుడో యుపన్యసించినపుడు వారి మాటలలోనుంచి మరొక యర్థము స్ఫురించవచ్చును కదా! వానికిని — ఈ మాటలు నేడు కొందరు వ్యక్తులు మాటాడుటకు వారియొక్క స్వార్థభావమెట్లు ప్రేరేపించుచున్నదో దానికిని, క్రమశఃనే మను కొన్న యూహలు ఈ పత్రికా ముఖమున వ్రాయగలము. క్రమముగా వ్రాయబడును.

తనచుట్టూ ఉన్నది స్త్రీలే. వాళ్ళందరూ సన్యాసినులే. తమ జీవితాలన్నీ భగవత్కైంకర్యంకోసం వినియోగించాలని నిర్ణయించుకొన్నవాళ్లే. ఆనిర్ణయంలో ఒక భేదమున్నది. నిర్ణయం లోకంలో ఒకటి వ్యక్తిగతంగా ఉంటుంది. ఒకటి సంస్థారూపంగా ఉంటుంది. వ్యక్తిగతంగా ఉన్న నిర్ణయాలలో గాఢత్వముంటుంది. సంస్థారూపంగా ఉన్నవాటిల్లో గాఢత్వం తక్కువా ఆచారమెక్కువా ఔతుంది. లోకమంతా ఇంతే. అందుచేత ఆ సన్యాసినులందరూ ఆచారసన్యాసినులు. అనగా వాళ్ల కాత్మానుసంధానంకంటె బహిరాకారం బహిరాచారాలు ఎక్కువగా ఉంటవి. అలాంటి వాళ్లుకూడా ఒక్కొక్కప్పుడు రక్షకభటులవలె పనిచేయగలరు. అందుచేత తనని తీసికొనివచ్చి ఇక్కడ ఉంచారు. స్త్రీలుకదా అని తప్పించుకు పోదామంటే ఆ గదిదాటి పోవటానికి వీలు లేదు. పోయినా ప్రహరీవాకిట కత్తులు తుపాకులు పుచ్చుకొన్న సైనికులు ఉండనే ఉంటారు. తప్పించుక పోవటానికి వీలేలేదు. పైగా తనకు తప్పించుక పోదామన్న ఊహేలేదు. తప్పించుకుని ఎక్కడికి పోవాలి. తనకు భర్తలేదు. పిల్లలులేరు. పూర్వం తనకు ఎవరితోనో కొందరు పురుషులతో సంపర్కం ఉండేది. ఆ సంపర్కం తాను కోరిందికాదు. తనకు చాలా అనిష్టమైంది. తన ధర్మానికి వ్యతిరిక్తమయింది. మహా ధనవంతులు, దుర్జనులు, దుష్టకాములు అయిన కొందరు పురుషులు తనను తన యిష్టంలేకుండా బెదరించి బ్రతకటం కష్టం అన్న స్థితి కల్పించి తనతో సంపర్కం కలిగించుకొన్నారు. వాళ్ళని వదిలించుకొని వచ్చేటప్పటికి ఆ నాలుగు మూడుసార్లూ తన శరీరం తనకు స్వాధీనం కాలేదు. ప్రతిసారీ తన అవయవములు తన ఒద్దికలోకి వచ్చేటప్పటికి సంవత్సరం పడుతూవచ్చింది. అల్లాంటి పురుషులు తాను ఆకారంచేత చెరకుగడవంటిదే కాని వారి భావనామార్గంలో వారు వాంఛించే చెరకురసం తనయందు లభించలేదని మళ్లీ తనవంక చూడలేదు. తాను తనజీవితాన్ని తన విద్యకంకితం చేసింది. తాను చేయటమేమిటి? తా నందుకోసమే పుట్టింది. ఆవిద్యకోసమే తాను పుట్టింది. తన శరీర నిర్మాణమంతా తన అవయవ సౌష్ఠవమంతా తన నడుము సన్నన అంతా తన వక్షస్సుయొక్క పరిణాహమంతా తన కాలిపిక్కల వరిసెన్నుతనమంతా తొడల బాల రంభా రమణీయత అంతా తన వ్రేళ్ళలయొక్క పసిత్రాచులతనమంతా తన కనుబొమల చిక్కదనమంతా ఆ విద్యకోసమే తాను పుట్టాననిపించింది. ఆ విద్యయే తన బ్రదుకు. తానే ఆ విద్య. ఆ విద్య తానుగా అవతరించింది. తాను భగవంతుణ్ణిగురించి ఎప్పుడూ అనుకోలేదు. అనుకోవాలనికూడా అనుకోదు. నిద్రలేస్తూనే చెక్కిలికండరాలు కదులుతవా లేదా? వ్రేళ్ళు మలగుతవా మలగవా? నడుము వంగుతుందా వంగదా మెడ యథేచ్ఛంగా తిరుగుతుందా తిరుగదా? ఇవ్వే చూచుకొంటుంది. తాను తినే ఆహారంకూడా తన శరీరావయవాలు తన స్వాధీనంలో ఉండేటట్టుగా చేసేదానినే అనుభవంమీద నిర్ణయించుకొని వాటినే తింటుంది.

నీ దారిని నీవు పోతుంటే మాత్రం లోకం ఊరకుంటుందా ? నీ అన్నం నువ్వు తింటూ ఊరికి భయపడుమని సామెత. లోకం తన కుటిలనీతి కనుగుణమైన సామెతలుకూడా ఏర్పరచుకుంటుంది. ఆ ధనవంతులైన దుష్ట పురుషులు తన్ను వదలిపెట్టారా. క్రమంగా లోకానికి తెలిసింది. చివురుజొంపాలూ, చల్ల గాలులూ, రెమ్మలూ, పూవులూ కలిగిన అందమైన చెట్టున్నది. ఆ పూలకు వాసన లేదు. అది కాయదు. ఆ చెట్టు ఎల్లాంటిదో తా నల్లాంటిదని లోకానికి తెలిసింది. తన్ను వదలిపెట్టింది. కాని లోకంలో రెండు ఉపయోగాలున్నవి. ఒకటి పండ్లు పండించుకు తినటం. రెండవది నరికి కట్టెలుకొట్టి పొయ్యిలోపెట్టటం. మొదటిది అచ్చంగా రుచికోసం చేసేది. రెండవది రుచికోసం ఏర్పడే పదార్థాలు పచనం చేసేందుకు సహాయపడేటట్టు చేసేది. రెండవది ప్రేమలేని ఉపయోగించుకోవటం. పరిగణన లేకుండా ఉపయోగించుకోవటం. నిరాదరణతో ఉపయోగించుకోవటం. తన్ను లోకం అల్లా ఉపయోగించుకోవటం ప్రారంభించింది. రుచి వ్యక్తికి సంబంధించింది. కట్టెలు లోకానికి సంబంధించింది. ఎవరైనా ఉపయోగించవచ్చు. అందరికీ ఉపయోగమే. తాను వ్యక్తుల రుచికి పనికి రాకపోయేటప్పటికి తన్ను సంఘానికీ రాజ్యానికీ తెగలబెడదామన్నారు. తాను సన్యాసినికాదు. తనకో సిద్ధాంతం లేదు. దేవుడూ దయ్యమూ లేదు. తనకు విద్యమాత్రమే ఉన్నది. తానా విద్య ప్రదర్శిస్తుంది. లోకం వ్యాఖ్యానాలు చేయటం మొదలుపెట్టింది. తానా విద్య ప్రదర్శించగా చూచిన వాళ్లు కొందరు. 'ఓహో! ఏమి విద్య ఆవిడ శివభక్తురాలు. శివుణ్ణి వ్యాఖ్యానం చేస్తున్నది.' అన్నారు. తాను పుట్టిన రాజ్యంలో వైష్ణవమతం ఉన్నది. పొరుగురాజ్యంలో శైవులు. తన దేశపురాజు తన్ను తన శత్రురాజ్యానికి పంపించి తన విద్య భాసింపజేసి తనద్వారా ఆ దేశంలో పలుకుబడి సంపాదించి తన్ను గూఢచారిగా వినియోగించుకొని వాళ్ళ కూపులు తీసి వాళ్ళని ఎలాగైనా స్వాధీనం చేసుకోవాలని అనుకున్నాడు. తన్ను పంపించాడు. తాను వెళ్లనంటే ఏంలాభం. ఇప్పుడు వీళ్ళేంచేశారో అప్పుడు వాళ్ళూ అదే చేస్తారు. ఈ శైవులదేశంలో తాను గూఢచారినేమో అని అనుమాన పడ్డారు. తన దగ్గరకు ఒక పిల్లను పంపించారు. అది తనదగ్గర బిడ్డల్లే పెరిగింది. దానిమీద తనకు మమకారం పెరిగింది. తనకు తన విద్యమీద కంటె దానిమీద ప్రేమ ఎక్కువైంది. దానికి తన రహస్యాలన్నీ చెప్పేసింది. ఆ చెప్పటంలో తన కిష్టము లేదన్నమాట వదలిపెట్టి తానిందుకోసం వచ్చానని చెప్పింది. ఆ కూతురు నికార్సైన గూఢచారిణి. పేరుకి ఆ దేశం శైవులు. వాళ్ళు శైవాన్ని వదలిపెట్టి చాల రోజులైంది. వాళ్లకి ఏ మతమూ లేదు. పైగా వాళ్ళు అన్నిమతాలకీ విరోధులు. వాళ్లకి మతంలో ఉన్న తక్కిన విషయాలన్నీ పోయినవి. మిగిలింది ఒక్క ప్రార్థన. చనిపోయేటప్పుడు ఓ శివా! నేను ఈయీ పాపాలు చేశాను, నన్ను క్షమించు అంటారు. ఆశివుడు వాళ్ళని కైలాసానికి తీసుకవెళతాడట. వాళ్ళు మతాన్ని వడపోతలు పోసిపోసి చివరకు ఈ ప్రార్థనలో దించారు. ప్రార్థించనివారు నరకానికి పోతారు. అది ఒక్కటే సిద్ధాంతం. అదే సర్వసృష్టిలో ఉన్న నాగరకతకు మకుటాయమానమైన విషయమయింది. తనదగ్గర తన రహస్యాలు లాగేందుకు వచ్చి కూతుకల్లే

ప్రవర్తించి తాను గూఢచారినని ఆ రాజ్యానికి తెలిపి తన్ను చెరసాలలో పెట్టించి రేపు తన్ను తుపాకితో కాల్చి చంపించేందుకు హేతు భూతురాలైన ఆ పిల్లఉన్నదే అది ఆడదో మగవాడో తెలియదు. దానియందు మానవత్వం ఉన్నదో రాక్షసత్వం ఉన్నదో తెలియదు. అది మానవ రాక్షస గంధర్వ పిశాచ గుహ్యకాది సర్వనామములకు అతీతమైన ఒక స్థితిలో ఉన్నది. ఆమె ఆ రాజ్యము యొక్క సిద్ధాంతముయొక్క స్వరూపము. ఆ రాజ్యం ఒక రాజ్యం. అది రాజ్యంకంటె ఇంక ఏదీకాదు. ఆ రాజ్యంలో మనుష్యులు రాజ్యంకోసం బ్రతుకుతారు. మనుష్యులకు మనుష్యత్వం లేదు. ఏ సిద్ధాంతమూ లేదు. రాజ్య సిద్ధాంతమని ఒకటున్నది. ఆ పిల్ల ఆ సిద్ధాంతంయొక్క ఆకారం.

కాని తన్ను తీసికొనివచ్చి ఈ సన్యాసినుల మఠంలో పెట్టారు. వీళ్ళది ప్రార్థనా మతం. ప్రార్థన చేయకపోతే నాస్తికు లౌతారుగదా! తాను పురుషుడైతే అక్కడనుంచి అక్కడికే వెళ్ళేది. స్త్రీ గనుక ఇక్కడినుంచి అక్కడికి పంపించేటట్టున్నారు. ఈ ప్రార్థనా సన్యాసినులు తనను ఉపయోగించుకొందామనుకుంటున్నారు. తాను రేపు తుపాకితో పేల్చబడుతుందిగదా! చచ్చేలోపుగా తన చేత ప్రార్థన చేయించితే తన ఆత్మకు ముక్తి వస్తుందని వాళ్ళ తాత్పర్యం. వాళ్ళ పట్టుదల.

అదేమిటో తాను బ్రతికినన్నాళ్లూ తనకిదే తెలిసిన విషయం. ప్రతివాళ్లూ తనని ఉపయోగించుకొందామనే. ఆ దుర్జనులైన ధనవంతులు అల్లా, ఆ దుష్టుడైన రాజు అల్లా. ఈ నిర్గుణమైన రాజ్యం ఇల్లా. ఈ సన్న్యాసినుల మఠంలో ఇల్లా. కూతురు అలా. తానో తనకేమీ అక్కరలేదు. ఆ దొంగ కూతురు మూలంగా తన విద్యే మానేసింది. ఇప్పుడు తన ఒడలు తనకు స్వాధీన మాతుందా? తన విద్య తాను మరచిపోలేదుకదా! మరచిపోలేదు. తన మనస్సులో తరంగాలు తరంగాలుగా వస్తున్నది.

బయట ప్రొద్దుక్రుంకింది కాబోలు. ద్వారబంధంలోంచి చీకట్లు వచ్చినవి. విద్యుద్దీపాలు వెలిగించారు. మఠాధికారిణితో పాటు తన కూతురూ వచ్చింది. కూతురు ఏమీ మాట్లాడలేదు. మఠాధికారిణి ఇల్లా అన్నది; "మా సన్యాసిని ఒకర్తె వస్తుంది. నీవు చేసినపాపాలు ఆవిడతో చెప్పు. ఆవిడ భగవంతునితో చెపుతుంది. భగవంతుడు నిన్ను క్షమిస్తాడు. నీ ఆత్మకు నిష్కృతికలుగుతుంది."

సంధ్య మాటాడలేదు.

యామిని ఇల్లా అన్నది. "సంధ్యా! ఈ దేశంలో ఇల్లాగే చేస్తారు"

సంధ్య అన్నది. "నేను నీకు సంధ్యనా, అమ్మనా, అమ్మను కాను. సంధ్యనే. నన్నమ్మివేశావు కదా!"

యామిని అన్నది "నేను నిన్ను కొనలేదు. నిన్ను అమ్మలేదు. నా ధర్మంకోసం నేను వచ్చాను. నా ధర్మం నేను చేశాను. నీవు అనవసరంగా తల్లి కూతుండ్ర భావం మన మధ్య ప్రవేశ పెట్టుకొన్నావు. దానికి నీవు బాధ పడుతున్నావు నా యందు దోషమారోపిస్తున్నావు. ఆ దోషం నీవు అనుకోవటంలో ఉందితప్ప నాయందు లేదు.

సంధ్యఅన్నది. "నీవు నాకు కూతురల్లే ప్రవర్తించావు. అప్పుడు అమ్మా అని పిలిచావు. పిలుస్తూ నీధర్మం నీవు చేస్తున్నాననుకొన్నావు. అమ్మా! అని పిలవటంలో లోకంలో ఉన్న తల్లీ కూతుళ్లమధ్య ఉండేభావం వ్యాపించింది. దానికి నీ బాధ్యత లేదంటు

న్నావు. ఆ భావాన్ని ఆశ్రయించి నీ ధర్మం చేశావు. నీ ధర్మానికి ఫలితంవచ్చింది. ఆశ్రయించిన ఆ భావానికి వ్యతిరేకంగా ప్రవర్తించటం మూలంగా దోషంవచ్చింది."

యామిని అన్నది. "లోకంలో దోషమనేదిలేదు. అది కల్పన". సంధ్య అన్నది. "ధర్మమనేదీ లేదు. అదీ కల్పనే"

యామిని నవ్వింది.

సంధ్య ఇల్లా అన్నది. "రేపు నిన్ను తుపాకితో పేల్చుగు. అందుచేత ఇవ్వాళ నవ్వుతావు."

మతాధికారిణి సన్యాసినిని సంపుతానన్నది. సంధ్య మాటాడలేదు.

రాత్రిగడచింది. తెల్లవారింది. నాటిమధ్యాహ్నము సూర్యుడు నడిమింటికి వచ్చినప్పుడు ఆమెను తుపాకితో కాల్చుతారు. ప్రొద్దుటి పూట గాలిలో చల్లదనం ఉంటుంది. తుపాకి గుండులోని వేడి చాలదేమో! అందుచేత లగ్నం పన్నెండుగంటలకు పెట్టారు.

మళ్లీ మతాధికారిణి వచ్చింది. ఇల్లా అన్నది. "నీ చివరికోరిక ఏదో చెప్పు. అది తీరుస్తాము." సంధ్య మాటాడలేదు. యామిని అన్నది. "ఆవిడకి నల్లని చీర ఇష్టం. ఎఱ్ఱని రవిక ఇష్టం. కాలికి గజ్జెలు ఇష్టం. ఆ గజ్జెలు కట్టుకొని నడవటం ఇష్టం."

సంధ్య నేత్రములు విస్తరించిచూచింది.

యామిని అన్నది. "ఆవిడ పూర్వంనాట్యకర్త్రి. అల్లావేషం వేసుకొని నాట్యంచేయడం ఆవిడకిష్టం."

సంధ్య కన్నులలోంచి యామిని దెసకు తల్లి ప్రేమపొంగి వచ్చింది.

యామిని మళ్ళీ అన్నది. "ఆవిడ నాట్యం చేస్తుంటే ప్రక్కన మద్దెలవాయించేవారు లేరు. నాకు మద్దెలవాయించటం నేర్పింది. ఆవిడకి తగినట్లుగా నేనే వాయించగలను."

సంధ్య కన్నులలో మెట్టప్రదేశములనుండి దిగి ఒక ప్రవాహము పల్లపు నేలలో ప్రవహిస్తూఉన్న శాంతమైన ఒక కాలువవలె వెలుగు ప్రసరించినది.

యామిని అన్నది. "వెనుక హంగు పాట పాడే వాళ్లుకావాలి."

సంధ్య అన్నది. "అక్కరలేదు. శ్రుతి మాత్రం చూడండి. నేనే పాడతాను. నేనే ఆడతాను.

సంధ్యనాట్యం చేస్తుందని నాలుగు నిముషాలలో మఠం మఠం అంతా మారుమ్రోగి పోయింది. ఆ రాజ్యంలో ఎక్కడికక్కడే గూఢచారుల సంస్థపనిచేస్తూ ఉంటుంది. అందులో గూఢచారిణులున్నారు. ఈ సంగతిపైకి తెలిసింది. తెలిస్తే చేయటానికి వీలులేదని ఆజ్ఞాపిస్తే సరిపోతుంది. ధర్మముగల రాజ్యం ధర్మములేని రాజ్యంఅని రెండు ఉంటై. ధర్మంగల రాజ్యంలో దోషాన్ని పరిహరించటానికి ప్రయత్నాలు జరుగుతవి. ధర్మంలేనిరాజ్యంలో దోషం జరిగేవరకూ ఊరుక్కొని ఊరకోవడమే కాదు దోషంజరిగేలందుకు తగినంత ప్రోత్సాహంచేసి దోషం జరిగిన తరువాత శిక్షించటం జరుగుతుంది. ఆ శిక్షించటంలో దయాదాక్షిణ్యాలు ఉండవు.

సంధ్యనాట్యం చేస్తుందని మఠమంతా మారుమ్రోగిపోయింది. ఒక్కశ్రుతే కావాలె, అది తేలికగా సంపాదించారు. నాట్యం ప్రారంభింపబడ్డది. మఠం లోపలున్న సన్యాసినులు నాట్యంయొక్క ముక్కూ మొగమూ యెరుగనివాళ్ళు. సంధ్య నిలుచోవటమే అడుగు వేయుటకు చీరకొంగు విసరటమే కన్నువిప్పటమే, ప్రక్కగా చూడటమే అన్నీ వాళ్ళకి క్రొత్తగా కనిపించినవి. నాట్యం సాగిపో

తున్నది. సన్యాసినులకు మొదలూ తుద తెలియటంలేదు. ద్రుతంమీద తానంమీద వెళ్ళిపోతున్నది. ఇదివరకు సంధ్య నాట్యంచేసింది. యామిని మద్దెలవాయించింది. సంధ్యయొక్క నాట్యంలోని చిక్కులన్నీ యామినికి తెలుసు. ఎంతద్రుతమైనా అందుకుంటుంది. ఎంతతానమైనా తమాయించుకుంటుంది. అ ప్పుడు మాత్రం యామినికి చేతకాలేదు. సంధ్య గిరికీలు తిరుగుతున్నది.

సూర్యకిరణాలు మఠానికి చుట్టూతిరిగినవి.

సంధ్య సగానికి సగం ఆకాశమునందే సంచరిస్తున్నది.

సూర్యకిరణాలు వృక్షాగ్రాలయందు సంచరించటం మొదలుపెట్టినవి.

సంధ్యకు తన ఒడలు తనకు తెలియదు.

సూర్యకిరణాలు తాము సూర్యకిరణాలమని మరచిపోయి నిప్పులు క్రక్కటం ఆరంభించినవి.

సన్యాసినులు తెల్లపోయి చూస్తున్నారు. యామినికి చేయి ఆడటంలేదు. సంధ్యకు శ్రుతి ఉన్నదో లేదో తెలియటంలేదు. మద్దెల మ్రోగుతున్నదో లేదో తెలియటంలేదు. శ్రుతి ఆవిడకు లోపలనుండే వస్తున్నది. తాళం లోపలనుంచే పడుతున్నది. శ్రమపడుతున్నది. ఆవిడనోటివెంట వచ్చే పాట ఆవిడికే వినిపిస్తున్నది గాని బయటి వాళ్ళకు వినపించటంలేదు. అదిలాస్యమైంది. ఉద్ధతనృత్యమైంది. ఉద్ధత తాండవమైంది. కాళ్ళాడుతున్నవని తెలియటంలేదు. చేతులు కదలటం కనిపించటంలేదు. సన్యాసినుల కన్నులు బైరులు క్రమ్మినవి. వాళ్ళకదేమిటో తెలియలేదు. కొంతసేపటిలో సంధ్య నేలమీద పడిపోయినట్లు ధ్వని వినిపించింది. అ మోత కందరూ మేల్కొన్నారు. ఆమె చుట్టూచేరారు. చేరిన వీళ్ళందరినీ రక్షకభటులు తొలగించారు. అక్కడికి రక్షకభటులు రాకూడదు. ఎల్లావచ్చారో వాళ్ళకి తెలియదు.

ఆరోజున ప్రొద్దుగుంకింది. సంధ్య శవంతోపాటు మరి రెండు శవాలు వెళ్ళినవి. మఠాధికారిణీ యామినీ వీళ్ళిద్దరూఆకాశంలో కలుసుకున్నామనుకున్నారా. మనమిద్దరం ఇక్కడ ఉన్నామేమిటీ అనుకున్నారు. మఠాధికారిణి ప్రార్థనచేస్తున్నది. నేను చేసిన తప్పులు క్షమించు అంటున్నది. నేను మఠానికి అధికారిణినైనా అధికారమంతా నా చేతులలో ఉంటటం మూలంగా ప్రభువా! నేను యథేచ్ఛంగా ప్రవర్తించాను. నన్ను ప్రేమించినవానితో నేను రహస్యంగా రాత్రులందు విహరిస్తూనే ఉన్నాను. మఠంలోఉన్న కొందరు ఇతర సన్యాసినులు నా రహస్యం తెలుసుకొన్నవాళ్ళుకూడా నన్ను లెక్కచేయకుండా వాళ్ళూ ప్రవర్తించారు. నేనూాయకోక తప్పక వచ్చింది. అని మఠాధికారిణి ప్రార్థన చేస్తూ ఉన్నది. యామిని ప్రక్కన నిలుచుండి నవ్వుతున్నది. ఇంతలో ఒక తెల్లని మబ్బు యామిని ముందరగా వెళ్ళింది. ఆ మబ్బు అద్దంవలె కనిపించింది. యామినికి తన నీడ తనకు ఆ అద్దంలో కనిపించింది. తానంతనల్లగా ఉన్నదేమి? తనకు కోరలు వచ్చిన వేమిటి? తన పెదవులంత లావేమిటి? తన చెక్కిళ్ళు దిగబడిపోయిన వేమి? తన కళ్ళు నిప్పులుగ్రక్కుతున్న వేమిటి? మఠాధికారిణివంక చూచింది. ఆవిడ ప్రార్థన మానేసింది. ఆవిడలో అంత మార్పు ఉన్నట్లు కనిపించటం లేదు. ఆవిడ రొమ్ము మాత్రం పూర్వం ఉన్న రొమ్ముకంటే పదిరెట్లు పెరిగింది. ఆవిడ జఘనంకూడా పదిరెట్లు పెరిగింది. ఆవిడ కళ్ళు పులికళ్ళవలె ఉన్నవి.

ఇద్దరూ కలిసి ఆకాశంలో తిరుగుతున్నారు. స్నేహితురాండ్రవలె తిరుగుతున్నారు. నల్లని మబ్బులు, తెల్లని మబ్బులు, ఎఱ్ఱని మబ్బులు క్రిందిభాగము నల్లన పైభాగము ఎఱ్ఱనయైన మబ్బులు. మబ్బుల్లో వెళుతూంటే బాగానే ఉంది. మబ్బులు లేనిచోట వెళుతూంటే అదేమో ఒళ్ళంతా సూదులుగ్రుచ్చుకొన్నట్లున్నది. ఎక్కడకు వెళుతున్నారో ఎందుకు వెళుతున్నారో వాళ్ళకే తెలియదు. ఆకాశమే అనంతంగా ఉన్నది. ఇక్కడకు వెళుతున్నామన్న నిర్దేశానికి వీలు కనపడటంలేదు. పోగా పోగా ఒక వెలుగుగోళంవలె కనిపించింది. అదేమిటా అనుకొన్నారు. అక్కడికి వెళదామా అనుకున్నారు. ఆ లోపలనుంచి ఏదో సంగీతం వలె వినిపిస్తున్నది. ఎవరో నృత్యంచేస్తున్నారనిపించింది. ఎవరో ఏమిటి? సంధ్య నృత్యం చేస్తున్నది. తాము సంధ్యానృత్యము చూస్తూచూస్తూనే ఇక్కడకు వచ్చారు. సంధ్య నృత్యం చేస్తున్నదన్నమాట మరిచేపోయారు. దగ్గరకు వెళ్ళారు. అదొక వెలుగు మేడ. మేడ కాదు మెట్లు, ఆ మెట్లమీద సంధ్య నృత్యం చేస్తున్నది. అవి మెట్లుకాదు. మద్దెలయొక్క ధ్వనే మెట్లుగా కనిపిస్తున్నది, అది వెలుగు కాదు, ఆవిడ నాట్యమే వెలుగుగా ప్రకాశిస్తున్నది. అది ఒక మధురమైన లోకంగా కనిపించింది. సంధ్య ఇక్కడకు వచ్చిందా? ఆమె నాట్యంలోని లయ ఇదా? ఆమె సంగీతంలోని శ్రుతి ఇదా?

మళ్ళీచూస్తే ఆ వెలుగు సూర్యకాంతి వలె ఉంది. మళ్ళీచూస్తే చంద్రకాంతివలె ఉంది. ఇదే కాలస్వరూపమా? ఇదే నాట్యమా? ఇదే లయా? ఇదే సంగీతమా? ఇదే వెలుగా? ఇంతకంటె భగవంతుడు లేడా? అని యీ చివరమాట వాళ్ళనుకోలేదు.

సంధ్య వెలుగుమెట్లు దిగివచ్చింది. వీళ్ళిద్దరినీ చూచింది.

మఠాధికారిణి అన్నది. "ప్రార్థనచేయి. నీ ఆత్మకు భగవంతుడు ముక్తి ఇస్తాడు."

యామిని అన్నది. "చాలా పొరపాటు పడుతున్నావు. నన్ను చూచి అనవసరంగా కూతురన్న భావం పెంపొందించుకున్నావు. రాజ్యానికీ వ్యక్తుల ప్రేమకూ సంబంధంలేదు. వ్యక్తులు ప్రేమలను కలిపించుకొంటున్నారు"

సంధ్య మళ్ళీ వెలుగు మెట్లెక్కుతున్నది. సుమనోహరమైన సంగీతం శ్రుతి మధురంగా లయరమ్యంగా సాగుతున్నది. సూర్య చంద్రులు పరివర్తనం పొందుతున్నారు. సృతి లయరాగములు సూర్య చంద్రులతో కలసిపోతున్నవి. లిప్తలిప్తకు వెలుగుగా మారిపోతున్నవి.

ధూళిపాళ శ్రీరామమూర్తి | # జీవునివేదన (కాళిదాసుని శ్లోకము)

వాల్మీకి వృత్తాంత పరిశీలనమువలన కావ్యానుభూతి జీవవేదనాత్మకమైనదని మనము గ్రహించితిమి. ఇపుడీ జీవుని వేదనయొక్క స్వరూపమేమియో కాళిదాసుని శ్లోకమును పర్యాలోచించి కొంత తెలిసికొనుటకు ప్రయత్నింతిము.

మనకు నిత్యజీవితములో బహువిధములైన వేదనములు కలుగుచున్నవి. వీనిలో కొన్ని సుఖాత్మకములు; కొన్ని దుఃఖాత్మకములు. జీవుని వేదనకును వీనికినిగల భేదమేమి? ఈ వేదనలన్నియు జీవుడు పొందుచున్నవేకదా? కాబట్టి యివికూడ జీవుని వేదనలే ఏలకారాదు? అన్న ప్రశ్నలున్నవి. ఈ వేదనలన్నియు జీవుని వేదనలే యైనచో గావ్యానుభూతికిని లౌకికానుభూతులకును భేదములేక పోవలసివచ్చును. అందుచేత లౌకికానుభూతులకు జీవునివేదనతో భేదము సాధింపవలసి యున్నది.

లౌకికానుభూతులను జీవుడు జాగ్రదవస్థయందు విషయములతో నింద్రియ సన్నికర్షమువలన పొందుచున్నాడు. బాహిరములైన విషయములయొక్క రంజనము జీవుని మనసుపైన నింద్రియద్వారమున ముద్రిత మగుచున్నది. జీవుని యంతఃకరణము విషయ వికారమగుట లౌకికానుభూతియొక్క పరమార్థము. ఇది సుఖదుఃఖాత్మకముగ ద్వంద్వ భూయిష్ఠముగనుండును. ఈ యనుభూతులు కూడ జీవుడు పొందునవే యైనను వానియందుగల విషయ ప్రాధాన్యమునుబట్టి వీనిని వైషయికానుభూతులని చెప్పుదురు. మఱి జీవుని వేదన యన్న మాటలో నుద్దిష్టమగు ననుభూతి యిట్టిదికాదు. జీవునియొక్క యంతఃకరణము ఇంద్రియ ముఖమున బహిర్వ్యాపారముమాని యంతఃప్రవణమైనపుడు జీవుడు పొందు ననుభూతి యది. ఈ విషయమును గాళిదాసుని శ్లోకము పర్యాలోచించుటవల్ల మనము లెస్సగా తెలిసికొనగల్గుదుము.

ఈ శ్లోకము కాళిదాసుని యభిజ్ఞాన శాకుంతలము నందలిది. అభిజ్ఞాన శాకుంతలములోని పంచమాంకము నందలిది. ఆ పంచమాంకమంతయు నీ శ్లోకముపైన నిర్మితమై యున్నది. ఒక విధముగ చూచినచో నసలు శాకుంతల నాటకమున కంతెయు నీ శ్లోకము మూలస్తంభమని చెప్పవచ్చును. ఈ శ్లోకము మానవ జీవితమునందలి యొక ప్రాణభూతమైన రహస్యమును వ్యాఖ్యానము చేయుచున్నది. మానవ జీవితమునందు సర్వ సంవిధానములు నే రహస్యముపై నాధారపడియున్నదో ఆ మహా రహస్యము నీ శ్లోకమునందు గాళిదాసు వ్యాకరించినాడు.

### -: పంచమాంకమునందు దుష్యంతుడు :-

శాకుంతల పంచమాంకమునందు రెండు ఘట్టములున్నవి. ఒకటి:- ఉపాలంభన ఘట్టము రెండవది:- ప్రత్యాదేశ ఘట్టము. మొదటి దానియందు హంసపదిక దుష్యంతు నుపాలభించును. రెండవదానియందు దుష్యంతుడు శకుంతలను ప్రత్యాదేశించును. ఈ రెండు ఘట్టములకు మధ్య పైన చెప్పిన వ్యాఖ్యా శ్లోకమీ రెండు ఘట్టములకు సమముగ నన్వయించును. మొదటి యుపాలంభన ఘట్టము కూడ రెండవదియైన ప్రత్యాదేశ ఘట్టమునకు సంగ్రహ స్వరూపము వంటిది. వెనుకకు

ప్రసరించిన ప్రత్యాదేశ ఘట్టముయొక్క నీడ వంటిది. ఒక యుచ్ఛ్రయమో ఒక యాపద యొ వచ్చుచున్నదనగా నది హఠాత్తుగా రాదు. ఆ యుచ్ఛ్రయమునకో ఆ యాపద కో ప్రతీకగా గొన్ని సూచనలు కలుగుచుం డును. ఈ యుపాలంభన ఘట్టము ప్రత్యా దేశ ఘట్టమున కట్టి ప్రతీక.

మఱి యీ ప్రత్యాదేశ ఘట్టమున్న ది. శాకుంతల నాటకమునందు సంవిధానక మంతయు నిండియున్నది. చక్కగా విచారిం చినచో శాకుంతలమునందు పంచమాంకమే పరమ రమణీయమైనది. ఎందుచేతననగా నాట కమందలి సంవిధానకమంతయు నిండియున్నది కాబట్టి.

"తత్రాపి చతుర్థాంకః" యను మాట విచారిత సుందరముకాదు. ఈ సంవిధానక ముయొక్క స్వరూపము కొంచెము విచారిం తము.

దుష్యంతుడు మునులతో వచ్చిన తన భార్య - శకుంతలను - చూచును. ఆమె యప్పు డెట్లున్నది? అవగుంఠనవతియై యు న్నది. నీతి పరిస్ఫుట శరీరలావణ్యయై యున్నది. ఋషులమధ్య ఎండుటాకుల మధ్య కిసలయమువలె నున్నది.

"కాస్వేవ గుంఠనవతీ నాతి పరిస్ఫుట
శరీర లావణ్యా
మధ్యేత ప్రాధనానాం కిసలయపోవ
పాండు వర్ణాణాం"

ఇట్టి శకుంతలనుజూచి దుష్యంతుని మనసు లోని యట్టయడుగు పొరలలో నొక యావే గము, ఒక యుత్కంఠ పెల్లుబికి వచ్చినది. ఎవరీమె? ఇది దుష్యంతునికి నామెను చూ డగనే పుట్టినప్రశ్న. అతని మనసులో నెక్క డనో, లీలగా ఒక గుర్తు కదలాడినది. కాని యది మనస్సుపై పొరలలోనికి రాలేదు. అది మనసులోని యడుగు పొరలోనే తిరుగుడు వడుచున్నది. సుళ్లు చుట్టుకొనుచున్నది. ఆ లోపలినుండి యేదో యొకబాధ త్రవ్వుకొని వచ్చుచున్నది. ఇది యంతయు "కాస్విత్" ఎవరీమె? ఎవరీమె? యని ప్రశ్నను బుట్టిం చినది. ఎంత ప్రయత్నించినను ఆ గుర్తు పై పొరలలోనికి రాలేదు. ఆమె తాను పూర్వ పరిణేతనని చెప్పుచున్నది. దుష్యంతుని పరి స్థితి యగుననుటకు వీలులేదు. కాదనుటకు వీలులేదు. అంతస్తుషారమైన కుందమును జూచిన భ్రమరమువలె దుష్యంతుని స్థితి యున్నది.

"భ్రమర యివవిభాతే కుందమంత
స్తుషారం
నచఖలు పరిభోక్తుం నైవశక్నో
మిహాతుం"

తుదకతడు శకుంతలను గ్రహింపలేదు. ఆమె నస్సరస గొంపోయెనని విన్నాడు. విని యున్నాడు కదా.

"వేత్రవతి పర్యాకులోస్మి—
"కామం ప్రత్యాదిష్టాంస్మరామి నపరి
గ్రహంమునే స్తనయాం
బలవత్తు దూయమానం ప్రత్యాయ
యతీవమే హృదయం"

ఈమె నా భార్యయని నేను గుర్తుపట్టలే కున్నాను. ఐనను నా హృదయము మిక్కిలి బాధపొందుచు నగు నన్నట్లు చెప్పుచున్నది"

మనసు నిర్ణయించలేకున్నదిగాని హృద యమగునన్నట్లు చెప్పుచున్నదట. అగునని చెప్పలేదు. అగునన్నట్లు చెప్పుచున్నది.ఇందు చేత రాజుపడ్డబాధ బహు విచిత్రమైనదని మనకు దెలియుచున్నది. ఈ బాధకు కారణ మేమియో రా జూపింపలేదు. ఇట్టి బాధ

రాజు పొందుటకు తగిన కారణ సామగ్రి రాజునకు తెలిసి ఏమియు లేదు. అందుచేత రాజుపొందిన బాధ రాజు మనసు పొందినది కాదు. బాహిరమైన శకుంతలాది విషయము కారణముగా కల్గినదికాదు. ఈ బాహిరమైన విషయభూతమైన శకుంతల రాజు మనసులోని యట్టడుగు పొరలలోనున్న శకుంతలను కదలించినది. ఆ లోపలి శకుంతలకదలి రాజు చిత్తము నంతః ప్రమాణము గావించినది. కాని యా శకుంతల బైటకు తేలలేదు. తేలినచో రాజు హృదయము బాధపడ నక్కఱలేదు. అతని చిత్త మంతః ప్రవణమగుటకు వీలులేదు. ఆ లోపలి శకుంతల బైటికి తేలకుండ రాజు మనసుపై శాపము పెద్దబరువై కూర్చున్నది. ఆ లోపలి శకుంతలమీద మఱపు ముసుగు కప్పినది. ఈ బైటి శకుంతల మేలిముసుగు కప్పుకున్నది. ఆ లోపలి శకుంతల రాజు హృదయమం దంతకుపూర్వమే కదలియున్నది. సరిగా మఱపు ముసుగువడ్డ యా లోపలి శకుంతలను రాజు హృదయము లోనుండి పీకి బైట నిలబెట్టినాడు కాళిదాసు. నిలబెట్టి రాజు చిత్తమునందు పొందిన విచిత్రమైన యనుభూతిని పఱచి చూపించినాడు. ఈ హృదయ గతమైన యంతరుద్బుద్ధమైన శకుంతలా సంస్కార స్వరూపమును దన కండ్లయెదుట నిలబెట్టినట్లు శకుంతల యతనికి కన్పించినది కావుననే 'కాస్విత్' ఎవరవే? యను అవేగములో ప్రశ్నించుకొన్నాడు. రాజీ ప్రశ్న నెవరి నడిగినాడు ? ఎవరినడిగిన నెవరు సమాధానము చెప్పెదరు. తన హృదయమునే యడిగికొన్నాడు రాజు. ఆ హృదయమేమో చెప్పను. దానికి భాషలేదు. అది యూరక బాధపొందునంతే.

ఇది బహు విచిత్రమైన ఘట్టము. మనుష్యుడు చేసేతుల తన ,కత్యంత ప్రియమైన వస్తువును జారవిడుచుకొనుచు నొక ప్రక్కనుండి ఎందుకో తెలియని బాధపడుచున్నాడు. మనుష్యుని స్వభావమే యిది. మనుష్య సృష్టిలోని రహస్యమే యిది. మనుష్యుం డేయన నేల? అసలు సృష్టి రహస్యమే ఇది. జీవుడు సర్వత్ర నుపలభ్యమానమగు నజ్ఞానముచే గృహీతుడై దుఃఖము నొందుచున్నాడు. ఈ దుఃఖము పరమసుఖ స్వరూపుడైన పరమేశ్వరుని విరహముచే బుట్టినది. ఇచ్చట రాజు జీవస్థానీయుఁడు. శకుంతల పరమేశ్వర స్థానీయురాలు. మఱపజ్ఞానమే రాజు పొందినబాధ పరమేశ్వర విరహమువలన జీవుడుపొందిన వేదన. ఇట్టి ఘట్టములు అప్పుడప్పుడు జీవితమునందు సంభవించి నిరంతర బహిఃప్రసరణ స్వభావమైన యంతఃకరణము నంతః ప్రవణముగావించి పరమేశ్వర విరహవేదనాస్వరూపమైన జీవుఁ యొక్క యచ్ఛమైన స్వరూపమును దళుక్కున మెఱపింప జేయుచుండును.

రాజు హృదయమును ఏతాదృశానుభవమున కున్ముఖముగా జేయుటకు ప్రబదీకగా హంస పదికోపాలంభన ఘట్టము కాళిదాసు నిర్మించినాడు. ఈ యుపాలంభన ఘట్టమునందు రాజుయొక్క హృదయము మూలముట్టుగ కదలింపబడినది. రాజు చాల సుఖముగ గూర్చున్నాడు. విదూషకునితో మంతనమాడుచున్నాడు. నేపథ్యమునుండి మధురమైన గీతము విన్పించినది.

'అభినవ మధులోలుపస్త్వం
తథా పరిచుంబ్య చూతమంజరీం,
కమలవసతిమాత్ర నిర్వృతో
మధుకర విస్మృతోస్యే నాంకథః.

ఓసి తుమ్మెదా! నీవు క్రొత్త తేనెకొఱకు దేవులాడెదవు. అట్లా మావిపూగుత్తిని ముద్దుకొంటివి. ఇప్పుడీ తామర పూవులో దూఱి మైమఱచితివి. ఆ మావి పూగుత్తి నెట్లు మఱచి పోతివోగదా ?

ఏవం విధార్థముగల గీతిని రాజు విన్నాడు. విని ఉత్కంఠితుఁడైనాడు. ఉత్కంఠితుఁడగుటకు న్యాయముగా కారణసామగ్రి ఏమియులేదు. మఱి యుత్కంఠితుఁడు కానేల ? ఆయన కిష్టజన విరహమేమియు లేదుకదా. ఈ ప్రశ్నయే రాజునకు కల్గినది. "కిన్ను ఖలు గీతమేవం విధార్థమాకర్ణ్య ఇష్టజన విరహాదృతేపి బలవదుత్కంఠితోస్మి" ఈ యుపాలంభార్థమైన గీతిని విని ఇష్టజన విరహము లేకున్నను మిక్కిలి యాకులపాటు పొందితినేల ? యని.

రాజున కిష్టజన విరహము తెలిసిలేదు. ఆయనకు తెలిసినది హంసపదిక తన్నుపాలంభించుచున్నదని మాత్రమే. కాని గీతము పోయి రాజు గుండెకు సూటిగ దాకినది. అచ్చట మఱపు ముసుగు కప్పికొనిన శకుంతలా వృత్తాంతమును గదలించినది. రాజుయొక్క హృదయమును జాగరూకము కావించినది. పూర్వానుభూతియైన శకుంతలను నీవు మఱచిపోతివి. ఏదో ఒక మహానర్ఘమైన మణిని నీవు పాఱవైచి కొంటివి. అని యా గీతి మాహృదయమును మేల్కొల్పినది. రాజు హృదయములో శకుంతల అస్పష్టముగా మెఱసినది. కాని స్పష్టముగా నది యతని మనసునకు వచ్చుటకు వీలు లేదుగదా. ఆ యస్పష్టమైన కదలిక ఆ గుండెకదుపు రాజు పొందిన వ్యాకులపాటు, రాజువిన్న గీతము సామాన్యాకారముగా శకుంతలా విషయిక రాజాపరాధమును సూచించుచున్నది. రాజు హృదయము దీనిని గ్రహించినది. మనస్సు హంస పదికను గ్రహించినది ఈ మనసు పొందు ననుభూతి లౌకికము. ఆ హృదయము పొందుననుభూతి జీవవేద నాత్మకమైనది. అనఁగా జీవుడు బాహిరజగత్తునందు పొందు ననుభవముకంటె నాంతరజగత్తునందు పొందు ననుభూతి విభిన్నమైనదని మనకు కాళిదాసు స్పష్టము చేయుచున్నాడన్న మాట.

ఆ బాహిర జగత్తునందలి విషయములు, ఈ యాంతర జగత్తునందలి విషయములను గదలించపచ్చును. కాని యవి జీవునిహృదయ వేదనకు కారణములు కాజాలవు. ఇట్లు మనస్సుయొక్క యనుభవము. హృదయముయొక్క యనుభవము దేనికది వేఱు. హంస పదికగీతి రాజు మనసులో నొక యనుభవమును కల్పించినది. ఆ యనుభవము హంసపదికా విషయికమైనది. రాజు హృదయమునందు పొందిన యనుభూతి శకుంతలా విషయికమైనది. హంసపదికగీతి దానికి సూచకమైనది, కాని కారణము కాలేదు. ఈ సూచకత్వమే వ్యంజకత్వము. రాజు మనసు గ్రహించిన యర్థము వేఱు. హృదయము గ్రహించిన యర్థము వేఱన్నమాట. ఇట్లు శకుంతలా వృత్తాంతమును వ్యంగ్య మొనరించుచు రాబోవు ప్రత్యాదేశ మహాఘట్టమునకు ఈ శ్లోకము చూళిక పట్టుచున్నది. చూళిక యనగా సూచికయని యర్థము. ఈ చూళిక ప్రత్యాదేశ ఘట్టమునకు అరుణోదయమునకు వేగుజుక్క వంటిది. శకుంతలా ప్రత్యాదేశ ఘట్టమును విప్పిచెప్పుటకై ఈ చూళికను గాళిదాస మహాకవి రచించెను. సంస్కృత సాహిత్యమం దెచ్చటను ఇట్టి ఘట్టము లేదు. దీనికి తుల్యమైన చూళిక లేదు. నిర్మాణ మర్మజ్ఞులగు శిల్పులలో గాళిదాసు మహాకవి

మేటియని యొప్పికొన్నచో నాయన శిల్పము చరమసీమ లందుకొన్నదీ పంచమాంకమందు. ఈ చూళిక ఆ చరమసీమ లందుకొన్న శిల్పమునకు మణికిరీటము.

ఇట్లీ సంవిధానమును సృష్టించి ఈ రెండు ఘట్టములకు మధ్య తాళపు జెవివంటి యీ వ్యాఖ్యా శ్లోకము కాళిదాసు ప్రవేశ పెట్టినాడు. ఈ తాళపు జెవి నుపయోగించి యీ ఘట్టములను పెట్టెలను దెఱచికొనవలయును. వానియందలి యనర్ఘమణులు కన్నులకు మిఱుమిట్లు గొల్పును. ఆ రెండు ఘట్టములయొక్క రహస్య మీ శ్లోకమునందున్నదన్నమాట. ఇప్పు డీ శ్లోకమును దీసికొని విచారింతము.

రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్
పర్యుత్సుకో భవతి యత్సుఖితోఽపి జంతుః
తచ్చేతసా స్మరతినూన మబోధపూర్వం
భావస్థిరాణి జననాంతర సౌహృదాని.

రమ్యమైన రూపముజూచి మధురమైన శబ్దమును విని సుఖవంతుడై నప్పటికిని మనుష్యుడు వ్యాకులపడుచున్నాడు. దీనికి కారణ మేమి? అతడా సమయమునందు చిత్తమున నాటుకొనియున్న జన్మాంతర స్నేహములను వానియొక్క యానుపూర్వి తెలియకుండ చిత్తముతో స్మరించుచున్నాడని శ్లోకార్థము. ఈ శ్లోకమునందు "చేతసాస్మరతి – అబోధ పూర్వం" మను మాటలు జాగ్రత్తగా విచారించదగ్గవి. స్మరణమనునది పూర్వానుభూతమైన విషయమునకే కుదురును. అననుభూత విషయము నస్మరణము పొసగదు కదా. ఒకనా విషయమును మనము స్మరించితి మనగా నావిషయముయొక్క జ్ఞానము మనకు పూర్వ మున్నదన్నమాట. జ్ఞానమనగా నానుపూర్వి తోగూడి యుండునది. అందుచేత స్మరణ శబ్దమున కానుపూర్వితోడ జ్ఞప్తికి తెచ్చుకొనుటయని యర్థము. మఱి యిచ్చటిస్మరణ మట్టిదికాదు. ఈ స్మరణమునందానుపూర్వి యొక్కబోధలేదు. ఇందుచేత నానావిచిత్రమైన యనుభూతియే యీ స్మరణమున కర్మమని తెలుచున్నది. పైదానికి చిత్తముతో జేసెడి స్మరణము – అనగా చిత్తములో పొందిన యనుభూతి. చిత్తమనగా హృదయ మన్నమాట. మనస్సుకాదు. అంతఃకరణ ప్రవృత్తులలో సూక్ష్మతమమైన ప్రవృత్తిచిత్తము. స్థూలతమమైన ప్రవృత్తి మనస్సు. బాహిరమైన జగత్ప్రవృత్తియంతయు నీ మనస్సుతో జేయబడుచుండును. అంతఃకరణము యొక్క బహిఃప్రసరణము మనస్సనియు నాంతఃప్రసరణము చిత్తమనియు జెప్పుకొనవచ్చును. అందుచేతనే తాదృశస్మరణకాలమునందు నంతఃకరణమునకు బహిఃప్రచారము ఉపశమించినదన్నమాట. బహిఃప్రపంచ గతము విషయములేవియు నీ స్మరణమున కిప్పుడు కారణములుకాజాలవు. పైనిచెప్పిన రమణీయ రూపమును మధురశబ్దమును బహిరములే కాని యాంతరములు కావుగదా.

అందుచే నివి యీ స్మరణమునందు కారణములగుటకు వీలులేదు. అదియంతఃకరణ మంతఃప్రవణ మగుటలో గారణములు కావచ్చుగాని స్మరణమందు గారణములుకావు. ఇచ్చట కారణత్వము విషయత్వోపకారణత్వ మని చెప్పుకొనవలెను. కారణములనగా విషయములన్నమాట. ఇవి కారణములైనచో నీ పొందుననుభూతి యబోధ పూర్వమగుట కుదురదు. పర్యుత్సుకత్వమగుట కుదురదు. ఇట్టి విషయములనుబట్టి యనుభూతికల్గించు సామర్థ్యము లోక సిద్ధముగాదు. అందుచే నీ

యనుభూతికిని యీ విషయములకు గార్య
కారణ సంబంధములేదు. వ్యంగ్యవ్యంజక
సంబంధము.

బాహిరమైన రమణీయరూపము – మధుర
శబ్దమీయనుభూతికి కారణమగుటకు వీలు
లేదు. కాబట్టి అంతరమైన కారణములనే
చెప్పవలెను. అదియే 'భావస్థిరాణి జననాంతర
సౌహృదాని' యని కాళిదాసు చెప్పినాడు.
చిత్తమునందు నాటికొనియున్న జన్మాంతర
స్నేహము లీయనుభవమునకు విషయములు.
భావస్థిరములగుటవలన నీ స్నేహములకు సం
స్కారములని యర్థము. స్నేహములు వాని
యంతట నవి చిత్తమునందుండలేవుకదా! వాని
రంజనము మాత్రము చిత్తమునందు ముద్రిత
ములగును. ఈ ముద్రలే సంస్కారములు.
ఇవి ఎచ్చటనుండును? భావమునందుండును.
భావమనగా జీవసంపుటియని యర్థము. అంతః
కరణమునకు ఏవిధమైన ప్రచారములేని స్థితి
భావమనబడును. అందుచేత భావమనగా
జీవుని స్వరూపమని యర్థము.

ఈ సంస్కారములు జీవుని స్వరూపమందు
ముద్రితములైయున్నవి. అందుచే జీవసంపుటి
లోనివి యొకభాగము. ఇవి జీవునకి బహుజన్మ
లయందు సంక్రమించినవికాబట్టి యివి జీవ
సంపుటియందు సంబంధ సాపేక్షకములుగా
గాక నిరపేక్షకములుగా నున్నవి. సాధారణీ
కృతములైయున్నవి. భావస్థిరాణి యనుటలో
నీయర్థమంతయు నున్నది. నిరపేక్షములైన సం
బంధశూన్యములైన యానుపూర్విరహితము
లైన యీ సంస్కారములు స్మరణములై
నప్పుడు పైనిచెప్పిన పర్యుత్సుకత్వముకల్గును.
ఈ సంస్కారములే జీవునికి జీవత్వ సంపాదక
ములు కాబట్టి యీ సంస్కారములయొక్క
యనుభవమునందు జీవునికి స్వరూపావగతి
కల్గుచున్నది. కావున పర్యుత్సుకత్వ మనగా
నేతాదృశ సంస్కారముఖమున జీవుడుపొందు
స్వరూపావగతి యని యర్థము. ఇదియే జీవుని
వేదన.

ఈ వేదన సుఖముకాదు. దుఃఖముకాదు.
వానికంటె విలక్షణమైనది. దీనిని సుఖమను
టకుగాని దుఃఖమనుటకుగాని వీలు లేదు,
కాబట్టి పర్యుత్సుకత్వమని కాళిదాసు చెప్పి
నాడు. సుఖదుఃఖములు లౌకిక విషయభోగ
జన్యమైనవి. సంబంధ సాపేక్షకమైనవి. పర్యవ
సానమున దుఃఖరూపమైనవి.

"పర్యుత్సుకో భవతి యత్సుఖితోఽపి జంతుః"

ఇచట సుఖిత శబ్దమునకు లౌకిక సుఖ
మర్థము. సుఖితోఽపియని సుఖిత శబ్దముతో
నన్వయించు నపి యను నవ్యయము
పర్యుత్సుకః — అనుదానిలో సుఖితయను
దానికిగల వైరుధ్యమును నిర్ధరించుచున్నది.
సుఖమునకు విరుద్ధగుణము దుఃఖము.

అందుచే బర్యుత్సుకత్వ మనగా దుఃఖము
కావలెను. కాని యీ పర్యుత్సుకత్వము
దుఃఖమనుటకును వీలులేదు. దుఃఖము సుఖ
మువలెనె లౌకిక విషయజన్యమైనది. పుత్ర
మిత్ర కళత్రాది వియోగజన్యమై సాపేక్షకమై
యుండునది. ఈ పర్యుత్సుకత్వము తాదృశ
కారణసామగ్రి జన్యమైనదికాదు. ఎందుచేత
ననగా నిది సుఖితుడైన వానికిని గలుగుచు
న్నది కాబట్టి. కావున సుఖితోఽపి యనుమాట
ఇది లౌకిక దుఃఖము కాదనుటకు వినిగమకము.
ఈ పర్యుత్సుకత్వము సుఖముకాదు. దుఃఖ
ముకాదు. సుఖమునకు విరుద్ధమైనది. అం
దుచేత దుఃఖమువంటి స్వభావముకలది. దుఃఖ
ముకాదు. అనగా నిరపేక్షమైన దుఃఖాను
భవము స్వరూపముగా గలదన్నమాట.

ఈ యర్థమును జెప్పుటకై పర్యుత్సుకత

శబ్దమును గాళిదాసు చెప్పినాడు. ఇది జీవుని యొక్క స్వరూపము.

జీవుని జీవత్వస్థితి నిరంతర వేదనాస్వరూపమైనది. కారణ మెరుఁగరాని యాలంబనము లేని తెల్లముకాని ఒకానొక వేదనను జీవుడు నిత్య మనుభవించుచుండును. ఏదియో యొక యనర్ఘమణిని బారవేసికొన్నట్లు, ఒక మహానంద సామ్రాజ్యమునుండి తాను జ్యుతుఁడైనట్లు జీవుఁ డెప్పుడు వేదన పొందుచుండును. ఆ పారవైచికొన్న మణియేదో- ఆ యానంద సామ్రాజ్యమేదో యదియేమియు వానికి దెలియదు. అది పట్టి నిరపేక్షమైన వేదన. దానినుపశమింప జేసికొనుటకుజీవుడు సర్వథా ప్రయత్నించు చుండును. అంతఃకరణముతో బహిః ప్రపంచమున దనకు దెలియకనే యతడు సుఖమునకై వెతకుచుండును. బహిః ప్రపంచ గత విషయానుభవము జీవుని వేదనాగ్నియందు హోమముచేయబడినదై తత్స్వరూపమగు వేదనయందే పర్యవసించుచుండును.

జీవుడు నిరంతర మా వేదనను బొందుట కేమి కారణము? అతడు పారవైచికొన్న మణియేమి? జీవునియొక్క యీ వేదన పరమార్థతః పరమేశ్వర విరహజన్యమైనది. పరమార్థతః జీవుడు పరమేశ్వరునితో నభిన్నుఁడు. ఆ పరమేశ్వరుని స్వరూప మానందము. జీవుని యొక్క స్వరూపము పరమార్థతః ఆనందము. అచ్చటనుండి చ్యుతుఁడై ఆ యానందమన్న మణిని జీవుడు పోగొట్టుకొన్నాడు. తన యిచ్ఛమైన స్వరూప మానందమని మఱచినాడు. ఈ మఱపే జీవునికి జీవత్వ సంపాదకమైనది. ఈ మఱపు నాశ్రయించుకొనియే బహుసంస్కారములున్నవి. తన స్వరూపమును దాను మఱచిపోయిన జీవుడు తనకు తెలియకుండనే బాహిర జగత్తున పరమేశ్వరునికై వెతకుచుండును. ఆ రమణీయరూపము లా మధుర శబ్దములు పరమేశ్వర విభూతి చిహ్నములు. అవి జీవుని జీవసంపుటిని గదలించి యతనికి యతని పరమేశ్వర విరహమును సాక్షాత్కరింప జేయును. పరమార్థతః జీవునియొక్క పరమేశ్వరాభిన్నత్వమును నిరవధిక సుఖ స్వరూపమును వ్యంజింపజేయును.

ఇది యంతయు జీవుని వేదన. కాళిదాసు చెప్పిన పర్యుత్సుకత్వ మిట్టి స్వరూపముకలది.

# వసంతసేన | శిరోమణి కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

దృశ్యకావ్యములు పది విధములని అలంకారికులు నిర్ణయించినారు. వానిలో రెండవది ప్రకరణము. అది శృంగార రసప్రధానమయినది. నాయకుడు ధీరశాంతుడు. మృచ్ఛకటికము ఈ కోవకు చెందినదే. ప్రకరణములో పది అంకములకు తక్కువ ఉండరాదు. శూద్రకుడను రాజు దీనిని క్రీ. శ. ౬వ శతాబ్దిలో రచించినాడు. మృచ్ఛకటిక అనగా మట్టిబండి. దీనిప్రసక్తి ఈ నాటక మధ్యములో వచ్చును. ఈ నాటకకథా నిర్వాహణమునకు ఈ బండి ప్రధానమయినది కనుక నాటకమునకా పేరే పెట్టుట ఎంతో సమంజసముగానున్నది.

కన్నులకు గట్టినట్లు సమాజమును చిత్రించిన నాటకములు సంస్కృతములో చాల తక్కువ. వానిలోను ఇది అత్యుత్తమ మయిన సాంఘిక నాటకము. శూద్రకుడు తనకాలము నాటి సంఘమును ఇందు చక్కగా చిత్రించినాడు. ఇందు పాత్ర పోషణము రసపోషణము ఎంతో చక్కగా ఈ కవి నిర్వహించినాడు. ఈ కవి ఉజ్జయిని రాజనియు, దండికవి మృచ్ఛకటికము రచించి ఇతని పేరు ప్రకటించినాడనియు లోకములో ప్రతీతి. కాని దీనిని ఈయనయే రచించినాడనుటలో సంశయము లేదు. విదిశా పాలకుడైన శూద్రకుడు మరొకడున్నట్లు బాణభట్టని కాదంబరివల్ల మనకు తెలియుచున్నది. మృచ్ఛకటికమునకు మూలము భాసుని చారుదత్త నాటక మనవచ్చును.

మృచ్ఛకటికములో చారుదత్తుడు కథానాయకుడు. అతడు బ్రాహ్మడు. నాయిక వసంతసేన. ఆమె వేశ్యకులములో పుట్టినదే కాని ఆమె వృత్తి కులాంగనలకు కూడ ఆదర్శముగా నుండును. ఈ నాటకములో ప్రతినాయకుడు శకారుడు. ఈ పాత్రను చాల అద్భుతముగా శూద్రక మహాకవి చిత్రించినాడు. అసలు సకారపాత్ర వేరే యేనాటకములో గూడ లేదు. శకారుడు కొందరు దుష్టులనుకూడగట్టుకొని వసంతసేనను చాల బాధించును. ఆమెను చారుదత్తునకు కాకుండజేసి తానుఅపహరించుటకు శకారుడు ఎన్నియోప్రయత్నములు చేయును. శకారుడు రాజు ఉంపుడుగత్తెకు తమ్ముడు. అధికారము కలవాడు. నీచుడు, మూర్ఖుడు, త్రాగుబోతు, క్రూరుడు. దుర్గుణములన్నింటికిని అతడు ఆలవాల మనవచ్చును. ఇతడు వసంతసేనను వశపరచుకొనుటకు క్రూరముగా జిత్తులు పన్నును. ఉత్తముడైన చారుదత్తుని గూడ పరాభవించుటకు నుదీయుడు.

ఒక చీకటి రాత్రిలో శకారుడు వసంతసేనను వెన్నంటి తరిమెను. ఆమె భయముతో చారుదత్తుని యింట దాగెను. ఆ దొంగల భయము వల్ల తన నగలు చారుదత్తుని యింట దాచెను. ఆనగలు చారుదత్తుని యింటిలో నుండి శర్విలకుడు అను దొంగ అపహరించెను. చారుదత్తుడు జాలిచే ఆ నగలకు బదులుగా తన భార్య రత్నహారమును వసంతసేనకు పంపెను.

శర్విలకుడు వసంతసేన నగలను తన ప్రియురాలు, మదనికకు పణ్యముగా నిచ్చుటకు దొంగిలించెను. మదనిక వసంతసేన చెలికత్తె. ఆమెయందు భక్తి విశ్వాసములు

గలదికాబట్టి మదనిక శర్విలకునితో ఆ నగ
లను తిరిగి వసంతసేనకే యిప్పించినది. ఆ తరు
వాత వసంతసేన చారుదత్తుడు పంపిన రత్న
హారమును తనవద్దనే ఉంచుకొని, దానికి
బదులుగా తన నగలను చారుదత్తునకు తిరిగి
యిచ్చినది. చారుదత్తుని కొడుకు, రోహసే
నుడు మంటి బండితో ఆడుకొనుచు మట్టి
బండి తన కక్కర లేదనియు, బంగారుబండి
కావలెననియు పోరుపెట్టుట వసంతసేనచూచి
తాను ధరించిన ఆభరణములన్నియు అతని
మట్టిబండిలో పెట్టి బంగారు బండి చేయించు
కొనుమని చెప్పి రోహసేనుని ఓదార్చినది.
వీధిలో చారుదత్తుని యింటిముందర నిలుచున్న
ఉత్తబండిని చూచి అది చారుదత్తుని బండియే
అనుకొని వసంతసేన పొరపాటున అందులో
నెక్కినది. అట్టి సంఘటనకు గాను వేచి
యున్న ఆబండి నేరుగా పుష్పోద్యానములో
వసంతసేనకై యెదురుచూచుచున్న శకారుని
వద్దకు తీసుకొని పోబడినది. శకారుడు వసంత
సేనను బలాత్కరించెను. ఆమె నిరాకరించెను.
అప్పుడు శకారుడు ఆమె గొంతు పిసుకగా
ఆమె క్రిందపడి మూర్ఛిల్లెను. ఆమె చచ్చిన
దనుకొని శకారుడు ఆమెపైన ఎండుటాకులు
కప్పి, ఆ సమాచారము నెరిగిన తన సేవకుని
బంధించి వెళ్ళిపోయి, "వసంతసేన నగలను
ఆశించి చారుదత్తుడు ఆమెను చంపె" నని
కోర్టులో దావావేసెను. చారుదత్తుని పై
న్యాయస్థానములో నేరము మోపబడినది.
చారుదత్తునికి కోర్టువారు ఉరిశిక్ష విధించిరి.

ఇదియంతయు వసంతసేన మరణించిన
దనుకొని శకారుడు పన్నినపన్నాగము. ఇంత
లో మూర్ఛపోయిన వసంతసేన తెప్పరిల్లి ఒక
బౌద్ధసన్యాసి సహాయముతో పట్టణములోనికి
వచ్చినది. ఆసమయములోనే శకారుని సేవ
కుడు తనకట్లు త్రెంచుకొని పరుగెత్తుచు కోర్టుకు
పోయి చారుదత్తుడు నిర్దోషి అని సాక్ష్యమిచ్చి
నిరూపించెను. అప్పటికి వసంతసేన కూడా
న్యాయస్థానమునకు వచ్చి చేరెను. ఆమెను
చూచి శకారుడు పారిపోయెను. చారుదత్తుని
కోర్టువారు నిర్దోషి అని విడిచిపెట్టిరి. అతడు
మిత్రులతో కలిసికొని ఉజ్జయిని రాజ్యాధి
కారమును పొందెను. అప్పుడు శకారుని
చారుదత్తుడు క్షమించెను. ఇది ధీరశాంతుడైన
చారుదత్తుని ఉత్తమ నాయకత్వమును నిరూ
పించుచున్నది.

వేశ్యాజాతిలో పుట్టినను వసంతసేన ప్రాణా
పాయకరమైన యిక్కట్లలో గూడ తన శీల
మును కాపాడుకొని జీవితమును చారుదత్తు
నకు అంకితముచేసినది. ఈ నాటకములో
ప్రధాన కథ చారుదత్తుని గృహకృత్యము
లకు సంబంధించినది. తక్కిన చిల్లర కథ
లన్నియు ప్రధాన కథకు పరిపోషకములుగా
నున్నవి.

వసంతసేనకు ఈడైన ఉదాత్త నాయిక
ఆంధ్ర సాహిత్యములో గురుజాడవారి కన్యా
శుల్కములో మధురవాణి కనబడుచున్నది.
ఇటువంటిదే చింతామణికూడ. కాని ఆమె
శీలము తొలినుండి వసంతసేన వంటిదికాదు.
మధురవాణి సత్కులములో పుట్టినది. వసంత
సేన వేశ్యకులములో పుట్టినను ఎన్నడుకూడ
ఆ కులవృత్తిని ఆమె తలంచనైనను లేదు.
అంతియేకాక, ఆమె, మహా పతివ్రతలకుండు
సద్గుణములు, సౌశీల్యము మూర్తీభవించిన
దేవత అనవచ్చును. ఆమె యీ సద్గుణముల
చేతనే చారుదత్తుని వంటి సత్పురుషుని, ఉత్త
మకుల సంజాతుని చేబట్ట గలిగెను. చారు
దత్తుడు తప్ప ఆమెకు వేరు లోకమే లేదు.
అతని ప్రేమ చూరగొన్నది. ఈ అంశములో

మధురవాణికిని ఈమెకును భేదము ఉన్నది. వసంతసేన "సానికి మంచితో పని ఉండదు" అన్న లోకోక్తి అసత్యమని నిరూపించి ఉదాత్తనాయికలలో ఉత్తమురాలుగా కీర్తిగాంచెను. ఆమె పురాణ నాయికలకు ఈడైనదనవచ్చును.

"కాంతలు తమశీలమును తామే కాపాడుకొనవలెగాని యితరులు చాలరు" అను విషయము "అత్రమ యాఽయమాత్మా స్వయమేవ రక్షితవ్యః"...అని వసంతసేన దుష్టుల చేతులలో చిక్కినప్పుడనిన వాక్యము వలన స్పష్టమగును. "అవేహి అనార్యం ఖలు మంత్రయసి" అని శకారుని, సీత రావణుని వలె, ధిక్కరించెను. శకారుడు తన ఔన్నత్యమును ఏకరువుపెట్టి ఆమెను బలాత్కరించినప్పుడామె "గుణః ఖలు అనురాగస్య కారణం స పునర్బలాత్కారః" అని తన గుణానురాగిత్వమును చాటెను. శకారుడామెను తరిమినప్పుడు భయముతో చారుదత్తుని యింటనే దూరి అతనిని చూచి "అపరాధ్యతాఽపి దుర్జనేనోపకృతం, యేన ప్రియసంగమః ప్రాపితః" అని యెంతయో సంతోషించెను.

చారుదత్తుడుకూడ "దేవతోపస్థానయోగ్యా యువతిరియం" అని ఆమె గొప్పతనమును పొగడెను. అతని వస్త్రమామెకు తాకినప్పుడతడు ఆమె వసంతసేనయని తెలియక, "దూషితా మమ వాససా" అని అనగా ఆమె మనస్సులో "ననుభూషితా" అని అనుకొనెను. తానా యింటిలో నుండినచో తనకుగాను పాపులువచ్చి ఆయనను బాధించెదరని "నగలకుగాను దొంగలు వచ్చుచున్నా"రను నెపముతో ఆ యిల్లు విడిచి తాను చిక్కులకు లోనై ప్రియుని గాపాడెను. అప్పుడు ఆమె నడవడిలో ఎంత ఉదాత్తతయో కనుపఱచెను.

"నాయిల్లు భద్రముగా లేదు. దొంగలు వచ్చెదరు. ఇక్కడ నగలు దాచకు" మని చారుదత్తుడు వసంతసేనతో అన్నప్పుడు ఆమె "పురుషేషున్యాసా నిక్షిప్యంతే నపునర్గేహేషు" అని తన విశాలహృదయమును, ఆయన గొప్పతనమును, ఆయనపై తనకుగల విశ్వాసమును చాటెను. ఆమె యింటిలో ప్రతిదినమును దేవతాపూజ జరుపుచు అతిపవిత్రముగ ఉండునని "అద్యసస్నాస్యామి. బ్రాహ్మణ ఏవ పూజాం నిర్వర్తయతు" అను మాటచేత స్పష్టమగును. మదనిక ఒకసారి ఆమెతో దరిద్రుడైన చారుదత్తుని ఎందుకు ఆశించెదవు? అని అన్నప్పుడామె "దరిద్రపురుష సంక్రాంత మనాః ఖలు గణికా లోకే అవచనీయా భవతి" అని చెప్పి వేశ్యలకుగూడ గుణపాఠము నేర్పినది. "అభయం శరణాగతస్య" అనిచెప్పి సంవాహకుడను జూదరికి శరణమిచ్చి అతనికీవసగూడ వేయించి తన శరణాగత రక్షణ గుణమును చాటెను.

"చారుదత్తుడు వైభవము లేనివాడు. అతనినెందుకు వరిస్తావు?" అని మదనిక అన్నప్పుడు ఆమె, "దుర్లభా గుణా విభవాశ్చ" అని ఆ రెంటికిని పొంతనము కుదురదని చెప్పెను. అంతమాత్రముతో ఆగక "అపేయేషు తటాకేషు బహుతర ముదకం భవతి" అని చెప్పి గుణహీనులకు ఎంత విభవముండినను ఏమి ప్రయోజనము? అని సూచించెను.

జూదరియైన సంవాహకుడు జూదములో అప్పుపడినపుడు అతనిని రక్షించుటకుగాను వసంతసేన "ఇదం హస్తాభరణం త్వం దేహి" అని తన సఖితో చెప్పి తన ఔదార్యమును చాటెను. చారుదత్తుని ఉత్తరీయమును కర్ణ

పూరకుడామె కిచ్చినప్పుడు "కర్ణపూరక ఇదం తే పారితోషికం" అని తన ఆభరణము నాతనికిచ్చి తనకు ప్రియునిపైగల ఆదరమును చూపెను.

ఒకప్పుడు వసంతసేన మదనికతో "నానా పురుష సంగేన వేశ్యాజనః అలీక దక్షిణో భవతి" అని చెప్పి "వేశ్యలు చూపు దాక్షిణ్యమంతయు అసత్యమే"యని వారిని వ్యంగ్యముగా నిందించెను. చారుదత్తుడు రత్నావళిని వసంతసేనకు పంపినప్పుడు "హీనకుసుమాదపి సహకార పాదపాన్మకరందబిందవో నిపతంతి" అని చెప్పి చారుదత్తుని గొప్పతనమును శ్లాఘించెను. చారుదత్తునివద్దకు ఆమె వెళ్ళబోవుచుండగా "అకాలమేఘము పాడచూపె" నని చేటి అనెను.

అప్పు డామె:—

"ఉదయంతు నామ మేఘా భవతు
నిశా వర్షమవిరతం పతతు
గణయామి నైవ సర్వం దయితాభి
ముఖేన హృదయేన"...అని అనెను.

అలాగే "గణయంతి న శీతోష్ణం రమణాభి ముఖాః స్త్రియః" అని మరొకచోట ఆమె చెప్పెను.

ఇంకొక చోట:—

"గర్జ వా వర్ష వా శక్ర ముంచ వా
శతశోఽశనిం
న శక్యా హి స్త్రియో లోద్ధుం
ప్రస్థితా దయితం ప్రతి"

అని చెప్పి ప్రియుని అభిసరించు స్త్రీల ప్రవృత్తిని, మనస్తత్వమును వసంతసేన ఎంతో బాగుగా అభివర్ణించినది. "పురుషుడైన మేఘుడు గర్జించినను, ఓ విద్యుత్తా స్త్రీ హృదయమును నీవైనను ఎరిగి మెరయ గూడదా." అని విద్యున్మేఘముల స్త్రీపురుష భావములను చమత్కారముగా వసంతసేన వర్ణించెను.

చారుదత్తుని భార్య ధూతాదేవితో, ఆమె ప్రథమ దర్శనములోనే వసంతసేన తన వినయమును ఆమె యెడ గూడ ప్రదర్శించుచు, "అహం శ్రీ చారుదత్తస్య గుణ నిర్జితా దాసీ, తథా యుష్మాకమపి." అని చెప్పి ఆమెకు గూడ తాను దాసినే అని చెప్పెను. దీనివల్ల దాసీత్వమునకు గుణమే ప్రధానము కాని విభవముకాదని తెలిపెను. చారుదత్తుని పుత్రుడు బంగారు బండికిగాను ఏడ్చుచుండగా "ఏహి మే పుత్రక! ఆలింగ, పుత్ర! మారుద, సౌవర్ణశకటికయాక్రీడిష్యసి" అని వసంతసేన అతనిని ఆశ్వాసించుచు అవ్యాజమైన పుత్రప్రేమను అతనియెడ చూపెను.

శకారుడు కనపడినప్పుడు వసంతసేన, "మమ నయన యోరాయాసకరః రాజశ్యాలః" అని అతనిని ఏవగింపుతో చూచెను. "చారుదత్తుని అభిసరించుచున్నావా" అని శకారు డన్నప్పుడు "ఆర్య చారుదత్త మభిసరామీత్యమునా వచసాఽలంకృతాస్మి," అని తన్ను తానే అభినందించుకొనెను. కోర్టులో వేశ్యమాతను, "వసంతసేన యెక్కడఉన్నది?" అని అడిగినప్పుడు "మే దారికా యౌవనసుఖమనుభవతి" అని సగర్వముగా చెప్పెను.

ఇంతగా చారుదత్తునిపై వసంతసేనకు అచంచలమయిన ప్రేమ కలుగుటకు అతని సుగుణములే కారణము. అతనిని అపరాధిగా కోర్టుకు పిలువవలసి నప్పుడుగూడ న్యాయాధిపతి "ఆర్య చారుదత్తోఽప్యస్మాభిరాహ్వాయితవ్యః?" అని ఆశ్చర్యపడి అనెను. న్యాయాధిపతికి అతనియెడగల గౌరవము దీనిచే తెలియును. న్యాయమూర్తి చారుదత్తుని చూచి "నహ్యాకృతిస్సు సదృశం విజహాతివృత్తం" అని

ఆయన ప్రవర్తనను ప్రశంసించెను. అంతియే కాక—

"తులనంచాద్రిరాజస్య సముద్రస్య చ తారణం,
గ్రహాణం చానిలస్యేవ చారుదత్తస్య దూషణం"

అని ఆయన గొప్పతనమును న్యాయాధిపతి న్యాయాలయములో ఉగ్గడించెను. "నహి మే వసంతసేనావిరహితస్య జీవితేన కృత్యం" అని తనకు వసంతసేనపైగల విడదీయరాని ప్రేమను న్యాయస్థానములో చారుదత్తుడు సూచించెను.

ఇట్టి పరస్పర ప్రేమగల వసంతసేనా చారుదత్తు లిరువురున్నూ ఉదాత్తులే. వేశ్యా సాంగత్యము, ఆదర్శ దాంపత్యమును పోలియున్నదని, పైన తెలిపిన మహాకవి వాక్యములవల్ల తెలియును. వసంతసేన పాత్రను కవి యెంతో ఆదర్శముగాను, ఉదాత్తముగాను చిత్రించినాడు.

---

# స్వీకారము

- తెరమెరుగులు ( నాటికలు ) – శోభా పబ్లికేషన్సు, విజయనగరము.
- రాగహృదయం – కె. వీరభద్రాచారి, ప్రకాశ దీక్షితులు – విజ్ఞానప్రభాస, భీమవరము.
- రారాజు – ముదిగొండ జ్వాలాపతి లింగశాస్త్రి, ఈమని.
- రవిప్రభ ,,
- కాంతిచక్రాలు – ఉండేల మాలకొండారెడ్డి, హైదరాబాద్.
- న్యాయమందిరం ( నాటికలు ) – ప్రేంకుమార్ పబ్లికేషన్స్, సామర్లకోట.
- భగవద్గీతా మాహాత్మ్యము – పురాణపండ రామమూర్తి, ఆధ్యాత్మ ప్రచారసంఘము, రాజమండ్రి.
- విశ్వశాంతి – పురాణపండ ప్రకాశ దీక్షితులు తరుణసాహితి, కాకినాడ.
- రేణుక – సరిపల్లి శ్రీమన్నారాయణరెడ్డి జనార్దనపురం, కృష్ణాజిల్లా.
- పర్జన్యము – జ్ఞానానందకవి, కాకినాడ.
- ప్రభంజనము ,, ,,

# కార్మిక భాణకం | హారీత శివశర్మ

ఎవ్వడే లోకమందు విస్తృతధనంబు
వస్తురూపమ్మునను సృష్టి వరలజేయు
నా తడగు కార్మికుని జూచినారమీర
లర్థహీనుని నూతను నబ్జసూతి.

తన కాయంబుననున్న కర్మమను ముక్తంబైన శక్తిన్ తనం
తన వే కన్నుల నింద్రుడై మరియు సంతన్ ముక్త సంగుండునై
ఒనరన్ శ్రీపతు లర్థవాదులు ధనవ్యూహంబుగా పన్ను వే
తనమన్ వాగుర జిక్కి; నెట్టి గొను చిత్రింబిద్దికన్నారటే.

పొలముల్ దున్నును ఫ్యాక్టరీల్ నడుపు నొప్పన్ కష్టమిష్టమ్ముగా
కలలన్ లేచును వేచు నిద్దురల నాగ్నాయీ మహాస్వామియై
చల దూర్ధ్వ ధ్వజమెట్టుఁట్టడను వీప్సాలిప్సకున్ చిక్కుచున్
తలవంచున్ గతి బంధురంబగుచు నాస్థల్ నాస్తికాగన్ మరిన్.

ఇల్లనిలేదు, వాకిలని యెక్కడనుండును ? యెల్లదేశమం
దిల్లుకొనున్; తనూ విశదీప్తిని కష్టము జేయు భుక్తికై !
చెల్లరె! వీడు యోగియః! వచింపను దంబరుడైన సిద్ధుడా!
యెల్లను వానిచేత బడియేడ్తెర నిత్య సుఖంబుగాంచగన్.

అరయఁగ వానలో తడిసి యంతట నెండకు నెండి నిత్యమున్
పరలు తపోనిదాఘ ఘనవర్తన మంతయు మూర్తి గొన్నఁటుల్
మరి తన సర్వసృష్టియును మాన్య తపః ఫలితంబు నెవ్వరే
దొరకొని సంగ్రహించు నెడ దూగడ! ఊరడిలున్ పొరింబొరిన్.

ఈ సాహిత్యము కల్గు దాసులమరెందే నున్న వేయన్న నె
ట్లో సాగింతురు వాదముల్ పనస లట్లున్ చెల్లరే శ్రీపతుల్,
దాసుల్ కార్మికులంతె; దైవములనన్ తామైన భావంబునన్;
ఈ సాహిత్య కదర్థమర్థతమమై హెచ్చున్ మహాకృచ్ఛమై.

కార్మికులన్న బానిసల? కారు; మరేమిగనట్లు కారునాన్;
వర్మకు బానిసీడు ధనవంతునకున్; మరియాస్థి; చెల్లరే!
కార్మికు డొక్కడై విభుడు, కాంచనగర్భుడు, తన్ను నమ్మకో
మర్మము నేర్చువాడు, గతిమంతుడు, సర్వపదార్థ రిక్తుడున్.

కలదు మతిపూర్వ హత్యంబు; కలదు హృదయ
కమల మమలంబు లోక సంగ్రహ మధూళి;
కలదు కన్నులపండు వెన్నెలలు విరియు
కాంతి ఆత్మకు లోన, చిక్కణము మరియు.

తమ్ము నెపగుదు; పరుల వర్తకములందు
తమ్ము నెరిగించు కొందురు; తమకులోన
నున్న కోర్కెల నడతురు; నూత్న ఋషులు
పరుల కోర్కెల కందింత్రు ఫలములన్ని.

కార్మికులన్న బానిసల? కారు; మరెవ్వరు? నిత్యకర్మతం
త్రోమ్ముల నున్న తొట్టియ సూగుమ స్థసముద్రమందునన్
ఓర్మి తోలంగు శ్రీపతుల కుంకువగా తనువిచ్చి, ప్రాణముల్
కూర్మిన సంగి, భుక్తిగొను కోవిదు లాత్మస్వతంత్రతాఖనుల్.

తనపాట్టన్ తను చూచుకోవలయునా? తాత్పర్యనిష్ఠన్ మరిన్
తన సంసారము తాస యేలుకొనునా! తాల్మిన్ ఘనస్వామికిన్
ఘనమూర్ధస్వాలమైన వస్తుచయమున్ కల్పించి సృష్టించునా!
తన స్వామిన్ బ్రతికించునా! మరియునంతన్ చేసేమేలించునా?

ఇది స్థేషంబనుకోడుస్వామి; మరితా నెంతో మహాధర్మమున్
మది నిల్పించుక, సర్వదైవత మహామాహాత్మ్య రేఖానుసం
పగలన్ తేలుచు నున్న యట్లు తలచున్; మత్యంతరాళస్థితిన్
కదులున్ తానును జీవుడై, మరియు భాగ్యంబేమొ బ్రహ్మంబునై.

ఈ పతనంబు లీయసలు నీ కృతులన్నియు పుణ్యసంచయం
బై పదలించుకొన్న గతమందలి జన్మల దానధర్మమై
శ్రీపదమై విలాసరసీసిత పుష్పక పత్రికంబులై,
శ్రీపతులెల్ల జన్మముల చేసిన సత్కృతులై చెలంగెడిన్.

ధనపతులపట్ల శాస్త్ర వర్తనము వేరు
కార్మికునిపట్ల చెప్పు తర్కములు వేరు
ఒకడు పుణ్యంబుచేసి పుట్టుక వహించె
పుట్టె నొక్కడు బహు పాపములను చేసి.

ఈ శాస్త్రంబులకర్థమిట్లు; మరినా బాదైవముల్ గూడ ధీ
నైశద్యంబున శ్రీపతుల్; వలయు సంప్రార్థింపగా నిర్వ్యరన్;
ఈశున్ దర్పణచేత ముక్తినిడు; నర్థేశుండో ధీశౌండుడై
ఆశల్ దూలిచి, అర్థముల్ డొలిచి, రథ్యల్ పన్నుముక్త్యర్థమై.

తనకు లేనట్టి సర్వమితరులయందు
కనుగొనుచు తృప్తిచెందునా కార్మికుండు
స్థేయఃపదమున నిలిచి పుష్పించు చున్న
కాశ్యపినిజూచి రక్తముల్ కన్నులందు
కాశ్యపిని జూచి ఖడ్గముల్ కరములందు
దాల్చి చేయుచధర్మ సంస్థాపనంబు.

# సుడిగుండం

మధురాంతకం రాజారాం

రెండు వేర్వేరు నదులు సమాంతరంగా ప్రవహిస్తూవచ్చి, సాగరంతో సంగమించే చోట ఒకదానితో ఒకటి కలిసిపోయినట్టుగా జానకి చెబుతూవచ్చిన 'చంద్రం బావ' కథా, ఉద్యోగ జీవితంలో నా కెదురుపడుతూవచ్చిన శేఖరంగారి వృత్తాంతమూ ఒక దానితో ఒకటి పెనవేసుకొని చివరకు గతంలోలీనమై మాటు మణిగిపోయాయి. పోగా చెప్పుకో డానికొక్క కథమాత్రం మిగిలింది.

ఒకానొక సామూహిక ఛాయాచిత్రంలో చంద్రాన్ని చూడటమైతే జరిగిందిగానీ, ఆ ఫోటో పదిహేనేళ్ళ నాటిది. బాల్యాన్ని అధిగమించి, యౌవనంలో కాలు పెడుతున్న చంద్రం సన్నగా,పొడుగ్గా కళ్ళల్లో కాంతులు నింపుకుని చిరునవ్వును మరీ అంత స్వేచ్ఛగా పారిపోకుండా పెదవుల చివళ్ళలో త్రొక్కి పట్టి వెలుగుతూ వెలుగుతూవున్న కాకర పువ్వొత్తిలా కనిపించాడు. ఆ చూపులేవో ప్రగల్భ భావాన్ని వెలార్చుతున్నాయి. కొంచెంగా కుంచించుకపోయిన కనుబొమలు మనిషిలోని ఆలోచనను, నిశ్చలత్వాన్నీ లీలగా ప్రకటిస్తున్నాయి. ఆ యీ విశేషాలతో ఆ ఆకృతి చాలా బాగున్నమాట నిజమే! కానీ ఎంత బాగున్నా అది ఫోటో కోసం పెట్టిన పోజు మాత్రం కాకపోదు. పార్సెలు అందచందాలను బట్టి లోలోపలి వస్తువుకు విలువ కట్టడం సమంజసం కాక పోవడం అటుండగా ఒక్కొక్కప్పుడు హాస్యాస్పదంగూడా కావచ్చు.

క్రొత్తకాపురం ప్రారంభమైన తొలిరోజుల్లో ఓ మిట్టమధ్యాహ్నం. గదిలో పడుకుని నిద్రపోవడానికి ప్రయత్నిస్తున్నాడు.జానకి గడపదగ్గర నిల్చుని ఎవరితోనో మాట్లాడుతోంది.

ఒకటి రెండు నిమిషాలపాటు విన్నతర్వాత అవతలి వ్యక్తి ఎవరో పోల్చుకో గలిగాను. అతడు చౌకరకం మిఠాయిఉండలు అమ్ముకునే ముక్కాలి ముదుసలి. బండలాంటి బట్ట తలకు ఓతుండుగుడ్డ చుట్టుకుని, రిపేర్లతో తలమునకలైన చెప్పుల్లోనుంచీ పాదాలను ఈడ్చుకుంటూ వీధులవెంటతిరిగే ఆ మిఠాయి బేరగాడు బహుశా ఎండ దెబ్బకు తట్టుకో లేక తన బడుగు దేహాన్ని వసారాలోకి చేర వేశాడేమో! అతడిపైన ప్రశ్నల వర్షం కురిపిస్తోంది జానకి. 'నీకు బిడ్డలు లేరూ? వాళ్ళు సంపాదించడంలేదూ? నీకు పూటకు పట్టెడన్నం పెట్టలేరూ?'

అప్పటికి నేనింకా జానకిని అర్థం చేసుకునే స్థితిలోనే వున్నాను. జీవితయాత్రలో కష్టనష్టాలను చవిచూచి, ఢక్కామొక్కలుతిన్న తర్వాతగానీ మానవుడికి విషాదోదంతాలు వినాలన్న ఆసక్తి, వినేపాటి గుండె నిబ్బరమూ సమకూరవు. ఎదురింటావిడ కట్టుకున్న కొత్తచీరపట్లగానీ, ప్రక్కింటావిడ కైసేసి కొన్న సరికొత్తరకం ఆభరణాల పట్లగానీ జానకి తన కుతూహలాన్ని వ్యక్తపరచివుంటే నాకంత ఆశ్చర్యం కలిగివుండేదికాదు.

నిద్రలేచిన తర్వాత "ముసలాడితో యింటర్వ్యూ ముగిసిందా జానకీ!" అన్నాను.

జానకి వులికిపడ్డట్టు తల పైకెత్తింది. అల్లల్లాడుతున్న రెప్పలక్రింద కనుపాపలు సంచలించి పోతుండగా "ఈ వూరి కొచ్చినప్పటి

నుంచీ ప్రతిరోజూ ఆ ముసలాణ్ణి చూస్తున్నా నండీ ! అతణ్ణి చూసినప్పుడల్లా నాకు మా పెద్దమామయ్య జ్ఞప్తికి వస్తాడు" అంది.

"ఆయనగూడా యిలాగే మిఠాయి వుండలు అమ్ముకుంటూ డేమిటి ?

"మిఠాయి వుండలు కావనుకోండి. ఆయన నీళ్ళ కావిళ్ళు మోసాడు. ఆ తరువాత ఒంటెద్దు బండిపైన పీపా వేసుకుని మంచినీళ్ళు తెచ్చి హోటళ్లకు పోశాడు. పూరిల్లున్న చోట పెంకుటిల్లు వేశాడు. తనూ వస్తులు న్నాడు. అత్తయ్యనీ వస్తులు పెట్టాడు. చిక్కి శల్యమయ్యాడు. ఒకనాడు కాసీకి టికాణా లేనివాడు కొడుకుని కాలేజిలో చేర్చాలంటే అందుకోసం అతిడెన్నిపాట్లు పడ్డాడో వివరంగా చెప్పక్కర్లేదు. చంద్రం బావ చదువు కుంటే కన కష్టాలు గట్టెక్కుతాయనీ, చదువుకుని ప్రయోజకుడైతే అతడే తన తమ్ముళ్ళకిద్దరికీ ఓ దోవ చూపిస్తాడనీ, కడగొట్టు పిల్లని ఓ అయ్యచేతికి పట్టిచ్చే పూచీగూడా అతనిదేననీ ఆయన కలలు గన్నాడు. కానీ కలలన్నీ కల్లలే గదండీ! డిగ్రీ పుచ్చుకుని యింటికి రాబోతుండగా చంద్రం బావను – గ్రద్దో, కాకపోతే గరుడపక్షో ఏమిటో మరి, అది అమాంతంగా తన్నుకెళ్ళి పోయింది..."

"గ్రద్ద తన్నుకపోడమే! మీ చంద్రం బావను! అసలు. సంగతేమిటి జానకీ ?" అన్నాను.

"గ్రద్దంటే గ్రద్దేకాదు. ఎవరో మహా రాజులు. చీర సెలక్షనుకోసం బట్టలంగడిలో జొరబడ్డట్టు కాలేజిపైన పడ్డారు. గాలించారు. చంద్రం బావను ఎన్నికచేశారు. తీసుకెళ్ళి ఆ శుభకార్యం కాస్తా జరిపించేశారు. అతడి చుట్టూ గిరిగీచేశారు. అంతే మరి! అప్పటి నుంచీ చంద్రం బావ ఆ కనిపించని కోటలోనే వుండిపోయాడు. ఆ కోట గోడదాటి ఈవలికి రాలేక పోయాడు..."

కాసేపాగి మళ్ళీ చెప్పక పోసాగింది జానకి "మా పెద్ద మామయ్య గతి మళ్ళీ మొదటికే వచ్చింది. అత్తయ్య మళ్ళీ వస్తులు మాడింది. కూతురి పెళ్ళితో ఆ వున్న పెంకుటిల్లు గూడా వూడ్చుకపోయింది. తీరామారా హైస్కూలు చదువుగూడా కొనసాగక కుర్రాళ్ళిద్దరూ దేశాలపాలయ్యారు. ఆ దిగులుతో అత్తయ్య మంచమెక్కి ఆఖరు శ్వాస వదిలేసింది. చివరకు మామయ్య కొమ్మలు లేని మోడులా మిగిలిపోయాడు..." వేడిగా నిట్టూర్చి మౌనంగా కూర్చుంది జానకి.

పోనీలే జానకీ! ఏనాడో జరిగిపోయిందానికి యిప్పుడు దిగులుపడడ మెందుకు ? లోకమంతా ఒక్కతీరుగా వుండదు. కొందరు లేనిపోని బాదర బందీలన్నీ కొని తెచ్చుకుని నలిగి నజ్జుగుజ్జయి పోతారు. మరికొందరు వున్నవాటినిగూడా వదలుకుని రెక్కలు గట్టుకుని పారిపోతారు. పెందలకడనే నిద్రలేచి పాఠములు శ్రద్ధగా చదువుకుని వేళకు సరిగా బడికేగు మంచి కుర్రవాళ్ళే వుంటారా ప్రపంచంలో! ఐనా కాటికి కాళ్ళు జాచుకున్న మీ పెద్ద మామయ్యకు యికపైన కొత్తగా రాబోయే కష్టా లేమున్నాయి గనుక ! ఓపినంత జీవితాన్ని ముందుంచుకున్న మీ చంద్రం బావైనా హాయిగా ఆనందంగా బ్రతుకుతున్నాడు. మన కంతే చాలు! ఎవరి అదృష్టం వాళ్లది!"

"అదేమిటండీ! అలాగనేశారు! అదృష్టవంతు లందరూ ఎవరి అదృష్టం వాళ్ళదే ననుకుంటే లోకంలో చాలామంది ఈమోస్తరుగానైనా బ్రతకడానికి వీలుండేదిగాదేమో"

సమస్త పీడితవర్గం తరఫునా వకాలత్తు

పుచ్చుకున్న దానిలా నిలదీసి అడుగుతోంది జానకి. ఆమెవాదం తేలికమాటలతో త్రోసి వేయ దగినంత నిస్సారమైంది గాదు. ఆ పరిస్థితిలో ప్రసంగాన్ని ఓ కొలిక్కి తెచ్చి జానకితో సమాధాన పడడంకన్నా ఉపాయాంతరం తోచింది గాదు.

"అవును జానకీ! నాలుకకు ఎముకెక్కడుంది? దానితో ఎలాగైనా మాట్లాడొచ్చు మరి!'' అంటూ నవ్వేశాను.

ఒక్క మిటాయి తాతలోనేగాదు, ఎక్కడైతే దుర్భరమైన యాతన మానవుణ్ణి కృంగదీస్తోందో, ఎక్కడైతే దుస్సహమైన వేదన మనిషిని అంతరాంతరాల్లోనుంచీ కాల్చుకతింటోందో అక్కడల్లా జానకికి తన పెద్దమామయ్యే కనిపించేవాడు. ఆ అభాగ్యుణ్ని గురించి తలచుకున్నప్పుడల్లా ఆమె చంద్రాన్ని గురించిన ప్రసక్తిని తేకుండా వుండలేక పోయేది.

తనంతెట తనకై బుద్ధి పుట్టినప్పుడు శిష్యునికి ఓ నిగూఢ విషయం బోధించే గురువులా అడపాదడపా జానకి చెబుతూ వచ్చిందిగానీ లేకుంటే చంద్రాన్ని గురించి చెప్పడానికి నాకేమీ తెలిసి వుండేదిగాదు. చంద్రం జానకికి మేనమామ కొడుకు. ఐనా నా కతడేమీ కాడు. ఎన్నడూ ముఖపరిచయమైనా లేని ఒక మానవుడిపట్ల ఆత్మీయతనుగానీ, వైముఖ్యతనుగానీ పెంచుకోవలసిన అవసరమేమీ నాకు కనిపించలేదు.

కానీ శేఖరంగారితో నా పరిచయం అలాంటిదిగాదు. సుడిగాలిలా నా ఉద్యోగ జీవితంలో ప్రవేశించిన ఉన్నతోద్యోగి శేఖరంగారు. 'అమ్మో, నిప్పులాంటి మనిషి'— 'అబ్బే, ఎలాంటి పనికైనా వెనుదీయని ఘటం' అంటూ పరస్పర విరుద్ధంగా పడుగూ పేకగా అల్లుకపోయిన ఊహాగానాల తెర వున్నట్టుండి పైకి లేచింది. పెడదారి వెంట పరుగెత్తీ పరుగెత్తీ పొరబాటు తెలిసిరాగానే ఆగిపోయి వెనుదిరిగి వెళ్లడానికీ మనస్కరించక, ముందుకు వెళ్ళడానికీ సాహసంలేక యిసుక తుపానులో చిక్కి బిక్కరిస్తున్న ఎడారి ప్రయాణీకుడిలా చిత్రంగా కనిపించారు శేఖరంగారు. ఆఫీసులో వున్నంతసేపూ ఆయన క్రింది వుద్యోగులను ముళ్ళపైన కూర్చోబెట్టేవారు. పీక నొక్కుతున్న తొందర పనులన్నింటినీ ఓ మూలకు నెట్టి హఠాత్తుగా ఓ ఫైలు కోసం కేకపెట్టేవారు. తీరా ఆ ఫైలును సముఖానికి తీసుకెళ్లేసరికి, అదిగాదు వేరొకటి తెమ్మనేవారు. ఎక్కడి కాగితాల నక్కడే పడవేసి, అవసరం వచ్చినప్పుడు వాటికోసం రికార్డు బాక్సు లన్నింటినీ తిరగ బోర్లించేవారు. ఆయనకు పనిచేసేవాళ్లెవరో తెలియదు. బద్ధకించేవాళ్లెవరో తెలియదు. తన కోపాగ్నికి యింధనంగా తలమాసినవా డొకడు దొరకడమే ఆయనకు కావలసింది! దారి తప్పి కొత్త అడివిలోకివచ్చిన మువ్వన్నె మెకం దిక్కులు దోచక అలా రొప్పుతుందేమో! ఆఫీసుచుట్టూ ఎర్రటి ఎండల్ని పరచి, వేడెక్కించిగానీ గాలిని సైతం లోపలికి వదలకుండా, రాతిగోడల మధ్య కూర్చున్న సర్కారు సిబ్బందికి సలక్షణంగా ఉష్ణోపచారాలు నెరపే చండమార్తాండుడే ఒక చుట్టు మేలు! ఆయన పడమటి జాముప్రొద్దుకైనా చల్లబడి పోతాడు.

శేఖరంగారు బాగా పొడుగరి. స్థూలం కాదుగానీ సొరకాయలా జజ్జుబారిన శరీరం ఆయనది. అదేం విచిత్రమోగానీ ఆ దేహం తమదన్న స్పృహకూడా ఆయన కుండేది గాదు. రోజుల తరబడీ సంస్కారానికి నోచు

కోని క్రాపింగులో, నలిగి మాసిపోయిన దుస్తులతో ఏదో మందకొడితనం గూడు కట్టుకున్న ముఖంతో, అప్పుడే నిద్రపడక నుంచి లేచినట్టుగా ఆయన ఆఫీసుకు వచ్చేసే వారు. బాహ్యలక్షణాలనుబట్టి చూచినట్టయితే ఆయన ఏదో అనారోగ్యంతో నానాటికి నీరసించి పోతున్నట్టు తోచేది. అందుకు తోడూ అనవసరమైన కోపం, చిరాకు, ఆందోళన — యివన్నీ కలిసి ఒక మానసిక రుగ్మతగా రూపొంది ఆయనను తహతహ లాడించేసేవి.

"ఇదంతా ఉన్మాదంలో ప్రాథమిక దశలా కనిపించడం లేదట్రా రాజూ!" అన్నాడు తోడిగుమాస్తా రాఘవేంద్రం ఒక్కసారి.

ఆ వ్యూహ తాకిడికి నేనొకటి రెండు క్షణాలు ప్రాన్పడిపోయాను. కానీ అదొక గొప్ప విశేషమే కానట్టు అకుండరు చలమయ్య రాఘవేంద్రంతో శృతి కలిపేశాడు.

"మెల్లగా అంటున్నారా బాబూ ఆమాట! ఆ చూపులే మనిషి చూపుల్లా వుండటం లేదండే, మరేమనుకోమంటారు! మాటిమాటికి బుర్రగోక్కోడం, వ్రాస్తూ వ్రాస్తూ కలం టేబిల్ పైనవుంచి నిట్టూరుస్తూ కుర్చీలో చేరగిలబడిపోడం, తలపగిలిపోతున్న దేమోనన్నట్టుగా కణతల్ని రెండుచేతుల్తోనూ అమిది పట్టుకోడం... ఒకటా, రెండా, ఎన్ని విడ్డూరాలు! నేననుకునేదేమిటంటే రాఘవేంద్రంగారూ, ఈ మనిషి కెవరిమైన్నో గానీ తీరని కసివున్నట్టుంది. ఆకసిని తీర్చుకునే దోవలేక, ఈయన సంకెళ్ళలో తగులుకున్న వాడిలా యిలా తల్లడిల్లిపోతున్నాడు..."

ఆఫీసులోపలా, బయటా యిలాంటి అభిప్రాయాలు కార్చిచ్చులా రగులుకో సాగాయి. ఆ చిచ్చు మరింత తీవ్రంగా వ్యాప్తం కావడానికి వీలుగా ఓరోజు సాయంత్రం ఆఫీసులో ఓ అపూర్వమైన సంఘటన జరిగింది.

ఆ రోజు వుదయంనుంచీ శేఖరంగారు మరీ బీభత్సంగా చిందులు ద్రొక్కేస్తున్నారు. గదిలోని కాలింగ్ బెల్ సరాసరి అయిదు నిమిషాల కొకసారి మ్రోగుతోంది. ఆ మోత చెవిలో చేరుకున్న జీరగ సంగీతంలా నినదించడంతో ఏ గుమస్తా ముఖంలో చూచినా కలవరపాటు ప్రస్ఫుటంగా గోచరిస్తోంది. లేదంటే ఒకటి రెండు శతాబ్దాల ఉద్యోగానుభవంలో లెక్కలేనన్ని ఆటు పోట్లకు తట్టుకున్న పాతపులులుమాత్రం నిశ్చింతిగా తమ పనేదో తాము చేసుకపోతున్నారు. అలాంటి కొందరిలో ఒక్కడైన నరసింహంకోసం జవాను పుల్లయ్య పరిగెంచి వచ్చాడు.

"బాబ్బాబూ! త్వరగా లేవాలి. అయ్యగారు పిలుస్తున్నారు" అన్నాడు.

"అదేమిటయ్యా పుల్లయ్యా! అక్కడేమయినా శుభముహూర్తానికి వేళ మీరిపోతోందా?" అన్నాడు నింపాదిగా నరసింహం.

"అబ్బే, అదికాదు బాబూ! మిమ్మల్ని గనుక క్షణాల్లో హాజరు పరచకపోతే ఆయన నాపైన విరుచుక పడతారు..."

"అప్పన్నే నాకు తెలుసుకానీ నువ్వెళ్ళు. వెళ్ళి, వస్తున్నానని చెప్పు." అంటూ నరసింహం మళ్ళీ తన పనిలో లీనమైపోయాడు.

ఆఫీసు ఆఫీసంతా నరసింహం గుండె నిబ్బరానికి విస్తుపోయింది. ఆఫీసరుగారి విగ్రహాన్ని నరకంగానూ, అనుగ్రహాన్ని స్వర్గంగానూ భావించే వారికి అతనిగుండె దిటవు తెంపరితనంగా గూడా భాసించింది. నిజానికి నరసింహం అదొక తరహా మనిషి. మనిషి మనిషికీ ఒకముద్దుపేరు పెట్టే రాఘవేంద్రం పరిభాషలో అతడు 'సాధుగర్వి'నిప్పును గప్పుకొన్న నివురు

లాంటి అసాధుత్వం గట్టిగా గాలివేస్తేగుప్పున ఎగిరిపోతుంది. అప్పుడతడు నరసింహంకాదు! ఖణిల్లున రంకెవేస్తూ పైకొచ్చే పోట్ల ఎద్దు! ఆ క్షణాన అతడినోటివెంట ఎలాటి మాటలైనా దొర్లిపోవచ్చు, ఎలాంటి కాని పనికైనా అతడు పూనుకోవచ్చు!

కళ్ళజోడు తీసి జేబులో వుంచుకుంటూ పైకి లేచాడు నరసింహం. గోదాలోకి నడుస్తున్న మల్లయుద్ధ వీరుడిలా అంగలుసాచి వేస్తూ, చేతులూపుకుంటూ తాశీల్దారుగారి గదిలో ప్రవేశించాడు.

ఈ నరసింహం వేళదప్పి ఆలస్యంగా మృగరాజు ఎదుటకు వెళ్తున్న చెవులపిల్లి! ఇతడి గతి ఏమౌతుంది? పైకప్పు విరిగి తలపైన పడుతుందా? భూదేవి పగిలి యితణ్ణి తన లోపలికి చేరదీసుకుంటుందా? పరిణామం ఎలా గుంటుందోనన్న ఉత్కంఠ ఆఫీసు వాతావరణంలో సుళ్ళు తిరుగుతోంది.

అందరూ అనుకున్నట్టుగానే గదిలోనుంచీ ఘెళఘెళారావంతో వురుము వినిపించింది. "ఇర్రెగులర్, యిర్రెస్పాన్సిబుల్! డ్యూటీఅంటే యింత నిర్లక్ష్యమా! ఏమిటీ డ్రాఫ్టు? ఇదీ ఒక వ్రాతేనా? మళ్ళీ పేరుకు యు. డీ. సీలు పాతపందికొక్కుల్లా..."

ఇంతవరకూ వినిపించిందేమో తాశీల్దారుగారి కంఠం. ఆ తరువాత ఓ గావుకేక వినిపించింది. అచ్చంగా అది కేకగూడా కాదు. సింహనాదం!

సభ్యత అసిధారావ్రతంగా పాటింప వలసిన ఉద్యోగ విధుల్లో ఒక్కటి. కానీ తనను తానే మరచినప్పుడు ఉద్యోగ విధు లెక్కడ జ్ఞాపకం వుంటాయి? రెప్పపాటు కాలంలో హాల్లోని కుర్చీలన్నీ ఖాళీ అయి పోయాయి. గదిలోపలి దృశ్యాన్ని చూడడానికి అనువుగా గుమాస్తాలు, బిళ్ళబంట్రోతులు, అటెండర్లూ రెక్క తలుపుల చాటున, కిటికీల దాపున మూగిపోయారు.

ఖాళీ కుర్చీకి చేతులానించి టేబిలుపైకి వంగి నిల్చున్నాడు నరసింహం. అతని కళ్ళు కొలిములో నిప్పుల్లా కణకణలాడిపోతున్నాయి. ముఖాన వువ్వెత్తుగా లేచిన నరాలలో రక్తప్రవాహం తాలూకు ఉధృతానికి అతడి ఉత్తమాంగం చలించి పోతోంది.

దెయ్యం ఆవేశించిన వాడిలా నిలువునా వూగిస లాడిపోతున్న నరసింహం ఎదుట శేఖరంగారు శరీరాన్నంతా కుర్చీలోకి కుంచించుకుని కూర్చున్నారు. ఆ ముఖాన కత్తివాటుకు నెత్తురుచుక్క లేదు. నుదుట గుప్పుగుప్పున చెమట పట్టిపోతుండగా, కళ్ళల్లో భయం తొంగి చూస్తుండగా ఆయన వడగాడ్పులో ఎండుటాకులా గిలగిల లాడిపోతున్నాడు.

ఎలాగైతేనేం అంతకుమించిన అఘాయిత్యమేమీ జరుగలేదుగనుక ఆరోజు ఆఫీసు నిద్రలేచిన వేళ మంచిదనే అనుకోవలసి వచ్చింది. మంచుగడ్డలా బిగుసుకపోయిన ముఖంతో విగ్రహంలా తిరిగివచ్చి నరసింహం తన సీటులో కూర్చున్నాడు.

కాళీయమర్దన, దక్షయజ్ఞ విధ్వంసాల తర్వాత ఆ లిస్టులో చేర్చుకోదగిన సాహస కార్యం చేసినందుకు నరసింహాన్ని అభినందించాలన్న కుతూహలం సహోద్యోగులందరికీ కద్దు! కానీ ఆ ఉగ్ర నారసింహ స్వరూపాన్ని సమీపించే ధైర్యం మాత్రం ఎవరికీ లేకపోయింది. ఆఖరుకు నాటకరంగంపైన స్త్రీ పాత్రలు ధరించడం ద్వారా జవరాళ్ళ పొకిళ్ళను కొంతవరకూ ఒంట బట్టించుకున్న రాఘవేంద్రం అభినవ చెంచులక్ష్మి పాత్రకు

ఒప్పింపబడ్డాడు. ప్రొద్దుబాగా వాటారిన తర్వాత కాంటీనులోకి వెళ్ళి కూర్చున్న నరసింహానికి ఆ వాడు పుట్టతేనెకు బదులుగా గ్లాసు నిండుకూ శీతల పానీయాన్ని సమర్పించుకుంటూ "గుమాస్తాగా పేర్కొన బడు తున్న మానవుడికికూడా మానం, మర్యాదా వుంటాయని ఋజువు చేశారు నరసింహం గారూ! స్టాఫు తరఫున సౌహార్ద్రమైన అభినందనలు స్వీకరించండి" అన్నాడు.

నరసింహం ఒక్కగుక్కలో కూల్ డ్రింకును మాయమాయంచేసి, సుదీర్ఘంగా ఓ వెడనవ్వు నవ్వి ఆ తరువాత నిమ్మళంగా ప్రారంభించాడు—

"అది కాదయ్యా రాఘవేంద్రం! ఎంతగా తను తాళిద్దారైతే మటుకూ యింత మిడి మేలమా! అతగాడి వికటనృత్యాలకు ఆఫీసు రంగస్థలమా? అతడి ఛేదరింపుల దుమారానికి తలఒగ్గి కుక్కిన పేలుగా పడివుంటారా మీరు? అహాఁ, నేను మిమ్మల్ని సూటిగా ప్రశ్నిస్తున్నాను. మీరు మనుషులు కాదూ?"

"ఐతేమటుకూ మేము చేయగలిగిందేముంది నరసింహముగారూ! పురుషులందు పుణ్యపురుషులు వేరైనట్టు పౌరుషం కలిగిన వాళ్ళుగూడా వేరేగదూ?" అన్నాడు రాఘవేంద్రం!

నరసింహం స్థాయి హెచ్చించాడు. "చూడు రాఘవేంద్రం! మీరిలా పిరికి మందు తాగి బతుకుతుండబట్టే అతగాడిలా నెత్తిపైకెక్కి కూర్చుంటున్నాడు. అయ్యగారు తన దొరతనం కలకాలం యిలాగే సాగుతుందని కలలు కంటున్నారేమో! అదేం జరగదు. ఇతడి బండారమంతా మన గుప్పిట్లోవుంది. ఈయనగారు కాపురముంటున్న మేడకు అద్దెంతో తెలుసా, అరవై అయిదు రూపాయలు. ఈయనకు నలుగురు బిడ్డలు. వాళ్ళల్లో యిద్దరు హైస్కూల్లోనూ, యిద్దరు ఎలిమెంటరీ స్కూల్లోనూ చదువుతారు. వాళ్ళు నేలపైన నడవరు. నెల కొక్కింటికీ స్కూళ్ళకు పోవడానికీ రావడానికీ జట్కాల కింద చెల్లుతున్న డబ్బు ముఫై రూపాయలు ఈ వూళ్ళో వున్నవి మూడు థియేటర్లు. వాటిల్లో క్రొత్తఆట ప్రారంభమయిన రోజున మొదటి తెరగతి సోఫాలను అలంకరించేవారు చిరంజీవులతో సహా శ్రీవారి జనానావారు. కోట రంగయ్యగారి బట్టలకొట్టు మీకు సుపరిచితమే ననుకుంటాను. ఆ కొట్టులో ఖాతా పుస్తకాలను తిరగవేసి చూడగలరా మీరు! దొరగారి బేరసారాలు ఎంత పెద్దఎత్తున జరుగుతున్నాయో చూస్తే తెలుస్తుంది. ఇదిగాక ఈయనగారి భౌతిక శరీరంలోని జీవకళను గ్లాటింగు పేపరులా పీల్చివేస్తున్న దొకటి వుంది. డయాబెటీస్! వారానికి మూడు చొప్పున ప్రతినెలా పన్నెండు విలువైన యింజక్షన్లతో దానికి సపర్యజరుగుతోంది. ఎరుగుదురా మీరు! నేను నిత్యావసరాల సంగతి అలావుంచి పైపై ఖర్చులనుగురించి మాత్రమే ప్రస్తావిస్తున్నాను. ఎక్కడనుంచివస్తోంది డబ్బు? ఏమిటీ చిదంబర రహస్యం? వివరాలు నేను చెప్పను. ఐనా యివి మూకిట మూసిపెట్టె దాగే సత్యాలు కావు. కాగల కార్యం గంధర్వులే నిర్వర్తిస్తారు..."

ఆ గంధర్వులు ఏరూపంలో అవతరించబోతున్నారన్న ప్రశ్నకుగూడా అనతికాలం లోనే సమాధానం లభించింది. స్థానిక వార పత్రిక 'బజావో ఢంకా'లో గుసగుసల శీర్షిక క్రింద టుమ్రీలాంటి వార్త ఒకటి ప్రచురింపబడింది.

"అధికారాహంకారోత్పత్తి ప్రణాళిక క్రింద

రైతుల కిస్తున్న అప్పాలలోనుంచీ గ్రామోద్యోగుల ద్వారా మితిమీరిన మామూళ్ళు గుంజుకుంటూ, చెరువు కంట్రాక్టర్లతో మంతనాలు సల్పి చెక్కు మార్చుకోగానే పర్సెంటేజి లెక్కన జేబులు నింపుకుంటూ, అధికార దర్పంతో మన్నూమిన్నూ గానక క్రింది వారిని నోటి కొచ్చినట్లల్లా తూలనాడుతూ ఒక పెద్ద వుద్యోగి సాగిస్తున్న గుడ్డిదర్బారు పట్ల విముఖత్వాన్ని ప్రకటిస్తూ అర్జీలు లెక్క లేని పిట్టలై జిల్లా హెడ్‌క్వార్టర్సుకు, రాష్ట్ర ముఖ్యనగరానికి పరతెంచి పోతున్నాయనీ. పాములు కప్పల్ని బట్టి మ్రింగినట్లుగా ఎవడి పాపాలు వాడినే మ్రింగుతాయన్న పెద్దల మాట పరమసత్యం గనుక త్వరలోనే అతడి పాపం పండకపోదనీ ఎన్. జి. వోల క్లబ్బు వెనుక వేపచెట్టుమీద కాపురమున్న కపోత మిథునంలో పోతుపక్షి పెంటిపక్షితో గుసగుసలాడుతోందన్న వార్త యింకా మీ చెవిదాకా రాలేదా ?''

అంతవరకూ చెవిదాకా వచ్చినా రాకపోయినా పత్రికలో పడినతర్వాత ఆ వార్తకు ప్రాణంవచ్చింది. ఎనభైనాలుగు లక్షల జీవరాసులలో అగ్రగణ్య మనిపించుకున్న మానవజాతిని గురించి దిక్కుమాలిన పక్షులే మాట్లాడుకుంటూ వుండగా తాము వూరుకోడం ఏ మాత్రమూ న్యాయం కాదన్నట్టుగా పదిమంది గుమిగూడిన ప్రతిచోటా యిదేచర్చ ప్రారంభమైంది !

శేఖరంగారు మాత్రం మామూలుగా ఆఫీసు కొస్తున్నారు. వెళ్తున్నారు. కానీ ఆయన మునుపటి మనిషి కాదు. ఇప్పుడు పిలుపులు లేవు. కాలింగ్ బెల్ శపిస్తే మ్రోగదు. లోపలికి వెళ్ళిన కాగితాలు సంతకాన్ని నమోదు చేయించుకుని తిరిగి రావడం మినహాయిస్తే ఆఫీసు తాశిల్దారుగారి అజమాయిషీ క్రింద పనిచేస్తున్న దనడానికి నిదర్శనాలే లేవు.

నిజానికి ఈ పరిణామాన్ని సాధించిన ఘనత ఏ ఒక్కరిదీ కాదు. అప్రతిహతమైన దైవసంకల్పం ఎదుట ఘోర పరాజయం పాలైన మానవ ప్రయత్నానికి ఉదాహరణగా కనపించేవారు శేఖరంగారు. పత్రికలో కెక్కినవార్తలు, పదిమందిలో చెలరేగిన సందేహాలు, పైవారిలో వేరూనుకున్న అనుమానాలు యివన్నీ కలిసి కట్టుగా రూపొంది ఈ మార్పును సాధించి వుంటాయనుకున్నట్టయితే ఆ వూహ సత్యానికి సమీపంగా వుండవచ్చు. కానీ ఈ సత్యానికి వ్యతిరిక్తంగా అవకాశం దొరికి నప్పుడల్లా నరసింహానికి ధూపారాధన పట్టడం ప్రారంభమైంది. నరసింహం సామాన్యుడు కాడు. అతడు నిరంకుశ రాచరికాన్ని హతమార్చాడు! దాస్య నిగళాల్ని ఛేదించాడు! స్వాతంత్ర్యాన్ని స్థాపించాడు !

కాని నన్ను మాత్రం ఓ సందేహం బాధిస్తుంటేది. ఎలాగైతే ఈ మూగతనం, ఈ పిరికితనం, ఈ స్తబ్దత్వం యివి శేఖరంగారికి జన్మతహావచ్చిన గుణాలు కావో అలాగే ఆ ముక్కోపం, ఆ పెడసరి తనం, ఆ విశృంఖలత్వం అవికూడా ఆయనకు పుట్టుకతో వచ్చిన గుణాలు కావేమో ! అవీ, యివీ కూడా శేఖరంగారి నిజమైన స్వభావాన్ని ఆవరించుకున్న చీకటి ముసుగులైతే ఆ ముసుగుల లోపలి శేఖరంగారు వస్తుతహా మంచివారేనేమో ! కావచ్చు. అసలు మానవ స్వభావమే ఒక ముడిపదార్థం. పరిస్థితుల ప్రభావంగానీ, పరిసరాల ప్రాబల్యంగానీ ఆ ముడిపదార్థాన్ని యిచ్చవచ్చి నట్టల్లా మార్చివేసే రసా

యనిక ద్రవ్యాలు. ఈ మార్పులకు అతీతంగా నిలబడ గలగడం మానవాతీతుడి లక్షణమైతే గావచ్చుగానీ మానవ మాత్రుడి తరం మాత్రం గాదు.

శేఖరంగారు మానవాతీతుడు గాదు. మానవ సామాన్యుడు.

శేఖరంగారి గత జీవితాన్ని గురించినాకు తెలిసిన వివరాలు తక్కువ. బొత్తిగా ఏమీ తెలియదన్నా తప్పుగాదు. కంటికి కనిపిస్తున్న కార్యాలకు వెనుక కంటికి కనిపించని కారణాలను వూహించుకోగలిగినప్పుడు మాత్రమే ఒక మనిషిని స్పష్టంగా అర్థంచేసుకోడానికి వీలుంటుంది.

నేను శేఖరంగారిని అర్థంచేసుకోడానికి ప్రయత్నించాను. కానీ నా ప్రయత్నం ప్రయత్నంగా వుండగానే శేఖరంగారి కథ శర వేగంతో పరుగుదీసి ముందుకు సాగ లేక మందుటిసుకల్లో యింకిపోయిన ప్రవాహంలా అఖరుకు ఒకస్మృతిగా మిగిలి పోయింది!

*　　　*　　　*

కాలాన్ని నదీప్రవాహంతోనూ, మానవ జీవితాన్ని నౌకాయానంతోనూ వుపమిస్తే విధి వక్రించి వెక్కిరించి వికటాట్టహాసం సలిపే సంఘటనలే సుడిగుండాలు. అలాంటి సుడిగుండంలో శేఖరంగారొక పూచిక పుల్లలా గిరవాట్లు కొడుతుండగా నేను చూచాను. ఆదృశ్యం కళ్ళబడేదాకా ఆయనను చుట్టుముట్టిన విషమ విపత్కరవిపరీత పరిస్థితులెలాటివో నేను పోల్చుకోలేక పోయాను.

ఓ రోజు సాయంత్రం అయిదు గంటలప్పుడు తాశీల్దారుగారు పిలవనంపారు. తీసుక రమ్మన్న కాగితాలతోసహా గదిలో ప్రవేశించాను. ఈ మధ్య నేను శేఖరంగారిని బాగా పరకాయించి చూ డ డ ం తటస్థించ లేదు.

గుంటలు పడిన కళ్లు, పైకి లేచిన నుదురు, చప్పిడి దవడలు, ఆ ఆకారంలో మానవుడైన శేఖరంగారు మరుగుపడి పోతున్నారు. పండ్రమాగి, ఎండిపోయిన జిల్లేడు ఆకులా పాలిపోయిన ఆ ముఖంలో నుంచి ఓ ప్రేతం తొంగిచూచినట్లయి, నేను టేబిలుకు కొంచెం దూరంలో చేష్టలు దక్కి స్థాణువునై నిల్చుండి పోయాను.

శేఖరంగారు ఓ ఫైలు నంబరు వుదాహరించి దానిపైన నేను తీసుకున్న చర్య ఏమిటో వాకబుచేశారు.

"అది రెండు మూడేళ్లుగా పేరుక పోయిన ఫైలుసార్ ! తీరిగ్గా చదివి అర్థం చేసుకోవాలి" అన్నాను.

"అఛ్ఛే, పీల్లేమ రాజూ ! రిమైండర్లకు పైన రిమైండర్లు వచ్చిపడుతున్నాయి. ఈ రోజుకూడా ఒకటి వచ్చిపట్టుంది. ఎలాగైనా రేపు డెస్పాచ్ చేసేయాలి."

"ప్రయత్నిస్తాను సార్ ! ఇంటికి తీసుకెళ్ళి రాత్రంతా మేలుకునైనా చదివి ముగిస్తాను"

"కానీ రేపు నేను క్యాంపు వెళ్తున్నాను..." కాసేపు ఆలోచించి" నువ్వొకపనిచేయగలవా రాజూ! రేపు వుదయం తొమ్మిదిగంటలకు నువ్వు నన్నింటిదగ్గర కలుసుకోవాలి. సంతకం పెట్టి క్యాంపుకు వెళ్తాను" అన్నారు శేఖరంగారు.

" అలాగేసండీ ! " అని సెలవు తీసుకున్నాను.

మరునాటి ఉదయం తొమ్మిది గంటలకల్లా నేను తాశీల్దారుగారి యింటి ముంగిట హాజరుగా వున్నాను. మాటలుగా పా ట లు గా నవ్వులుగా కేరింతలుగా అలికిడైతే వినిపిస్తోంది గానీ మనుషుల పొలకువమాత్రం కనరావడం లేదు. గంట తొమ్మిదిన్నర గూడా దాటింది.

ఇంకా తామసించడానికి మనస్కరించక మెల్లగా వరండా దాటుకుని వెయిటింగు రూము చివరనుంచీ హాల్లోపలికి చూసాను.

ఇంద్ర ధనస్సులోని రంగుల్ని కలగాపులగంచేసి చిమ్మనగ్రోవితో వెదజల్లినట్టుగా గోడల నిండుకూ కాలెండర్లూ వ్రేలాడుతున్నాయి. క్యాలెండర్ల పైకెక్కి బొమ్మలై కూర్చున్న కుటిలాలకలు, హరిణేక్షణలు, మృగరాజ మధ్యలు తమతమ వీలునుబట్టి నృత్యభంగిమలో నిల్చుని తిండికంటే నీళ్ళకంటే, స్నోలు, పౌడర్లు, సబ్బులు, తలనూనెలే ప్రాణావసరాలని హితబోధ గావిస్తున్నారు. హాలుమధ్య నేలపైన పడివున్న ట్రంకులూ, సూట్ కేసులూ, చేతిసంచులు ప్రయాణ సంరంభాన్ని సూచిస్తున్నాయి.

"ఎవరండీ! ఏంకావాలి?"

ఉలికిపడి తల పైకెత్తాను. తలపైకెత్తిన క్షణంలో నా కళ్ళకొక మంచు శిఖరం కనిపించినట్టుతోచింది. ఆవిడకట్టుకున్నది మంచుకంటే తెల్లని చీర. జానెడు వెడల్పుతో ఎర్రటి బార్డరు చీర సంబడీ శరీరంచుట్టూ వంకరలు తిరుగుతోంది. జరిగ పోగులు పూవులై పూచి, కాయలైకాచి చిన్న పూలతోటలావున్న పమిడె చెంగు గాలిలో రెపరెపలాడుతుండగా ఆవిడ మెట్లుదిగుతోంది.

"మరేం లేదండీ! తొమ్మిది గంటలకు నన్ను రమ్మన్నారు..."

"రమ్మన్నారు. తనేమో క్యాంపుకు వెళ్ళిపోయారు. పోనీలెండి! మీరు రావడంగూడా ఒకందుకు మంచిదే అయింది. కూర్చోగలరా కాసేపు! కాస్త పనుంది."

కూర్చోకేం చేస్తాను! ఆ మాటలధోరణి అలాంటిది. క్రొత్తపాతల తారతమ్యమేమీ ఆమెకు కాబట్టినట్టులేదు. ఆమెకేదో పనుంది. ఆ పనిని చేసిపెట్టడానికే నేనక్కడ ప్రత్యక్షమైవుంటానని ఆమె వుద్దేశించింది.

"ఏమంత పెద్దపనికాదులెండి! స్టేషను దాకావచ్చి మమ్మల్ని రైలెక్కించాలి."

"జట్కా తీసుకరమ్మంటారా" అన్నాను.

"ఉండండి మరి. కొంచెం నిదానించాలి. జట్కాగాకపోతే ఈ వూళ్ళో టాక్సీలు దొరకుతాయేమన్నా నా! అందుకే వద్దు బాబో ఈ వూరు అని మొత్తుకున్నాను. రైలు పదకొండు గంటల కంటే పదికే యిల్లువదలాలి. రెండుమైళ్ళ దూరం జట్కాలో కూర్చుంటే ఒళ్ళంతా ఒక పనస హూనమైపోతుంది..."

"కానీ ఆ రైళ్ళకంటే ఈ జట్కాలే నయం కదండీ! రైళ్ళలో ఒక్కొక్కప్పుడు నిల్చోడానికైనా తావుండదు."

నావైపు ఆశ్చర్యంగా చూస్తూ ఆమె "నిల్చోడమేం కర్మమండీ! ఫస్టుక్లాసు కంపార్టుమెంటు యింటికన్నా హాయిగా వుంటుంది. మీరు అప్పుడప్పుడూ నిల్చునిగూడా ప్రయాణాలు చేస్తారా ఏమిటి?" అంది.

నా మట్టుకు నేను యిహానికీ పరానికీ సరి హస్తగీతాలాంటి ఫుట్ బోర్డుపైన నిల్చున్న ప్రయాణాలుగూడా వున్నాయి. కానీ ఆ ప్రయాణానుభవాలను నివేదించుకునే చొరవగానీ వ్యవధిగానీ నాకు లేకపోయింది.

"ఆయన అలా వెళ్ళగానే పోస్టుమేన్ వచ్చి ఓ వుత్తరం పడేసిపోయాడు. 'కృష్ణుడికి పుట్టిన రోజు. నువ్వు తప్పకరావాలి. మీ అమ్మగూడా రాజేశ్వరి లేకపోతే పండగ పండగగా వుండదని చెబుతోంది' అంటూ నాన్నగారు వ్రాశారు. తాళంచెవి ఎవరిదగ్గరయిచ్చి వెళ్లడమా అని ఆలోచిస్తుండగా మీరు కనిపించారు..."

"అమ్మాన్! నా బ్లూకలర్ షిఫాన్ చీర

ఏదీ ? బీరువా అంతా వెదికేశాను. కనపడ్డం లేదు."

ఈసారి పైకి చూచేసరికి చీరకట్టుకున్న చెరకుగెడలా ఓ అమ్మాయి దృగ్గోచరమైంది. ఈ వుపమానానికి వీలైనంత న్యాయం చేకూర్చడానికి అనువుగా ఆమె గుబురుగా పెరిగిన చెరకు సోగలకుమల్లే శిరోజాలను గూళ్ళుగూళ్ళుగా అమర్చుకుంది. గరిమనాభి నుంచీవస్తున్న సరళరేఖ ఆధారతలంలో పడడంలేదేమో, ఆమె ఒక్కొక్క మెట్టు దిగినప్పుడల్లా ఒక్కొక్క రకంగా వంపులుతిరిగి పోతోంది.

"నీ బట్ట లెక్కడుంటాయో నీకే తెలియకపోతే ఎలాగే విమలా! ఆ పెట్టెలో వుంటుంది చూడు..."

విమల పెట్టెతెరిచి ఒళ్ళు అయ్యాకాకుండా చేతికి దొరికిన చీరలూ చోళీలూ చెల్లాచెదరుచేసి వెదకి వెదకి వేసారి పోయినట్టుగా "నాలుగు రోజులుండి రావడానికి యిన్ని బట్టలెందుకే అమ్మా! నువ్వొకరీను!" అంటూ సోఫాలో సోలిపోయింది.

"ఓసి నీయిల్లు బంగారంగానూ! చూచారటండీ! ఇది వట్టి పిచ్చిమాలోకం. మనమేమీ పెట్టెల్ని మోసుకెళ్ళడం లేదుగదా! ఇక మరి యింట్లోవున్న బట్టలన్నీ తీసుకెళ్తే మాత్రం పోయేదేముంది? నిజం చెప్పొద్దూ, మా వదినె కొకటే తెగనీలుగు! ఏమంటే తనకొక పెట్టె నిండుకూ బట్టలున్నాయని! అందుకని ఓరోజు నే నన్నానుగదా—
'ఏమమ్మో వదినా! రెండు బీరువాలు చాలడంలేదు మాకు! మాకోదానికి ఆర్డరిచ్చాము' అన్నానా, ఆవిడగారి ముఖం చింతాకంతైపోయింది!"

రాజేశ్వరమ్మగారు గుక్క తిప్పుకోకుండా నవ్వసాగారు. గడచిన పది పదిహేను నిమిషాల్లో ఆనవ్వు ఒకటి రెండుసార్లు నాకు పరిచితమే. కానీ అబ్బుర మేమిటంటే విమల అన్న చిన్న పేరుతో వ్యవహారింప బడుతున్న ఆ సన్నటి అమ్మాయిగూడా గాలివానలో వెదురుబొంగులా వూగిపోతూ నవ్వసాగింది. అది బండరాతిపైన గండశిల దొర్లుతున్నట్టున్న నవ్వు. ఇది కంచుపాత్రలో గులకరాళ్ళు వేసి గిలకరించినట్టున్న నవ్వు.

"అంతే కాదండోయ్! ఇక్కడ మా అనసూయను గురించి కొంచెం చెప్పాలి. అనసూయంటే మా అందరిలోనూ కడగొట్టు అమ్మాయన్న మాట! దాని మొగుడు పేరుకు పెద్ద ఆఫీసరు. కానీ దానికి పట్టుమని పదిచీరలుండవు. ఈ పెట్టెలతో, ఈ సరంజామాతో నేను దిగితే చాలు, అది కుళ్ళి చస్తుంది."

"అవునే అమ్మా! పాపం, అనసూయ పిన్నిని చూస్తుంటే జాలేస్తుంది..."

"నీ జాలికి వేళా పాళా లేదుగానీ రవీ ఎక్కడ? మురళి ఏమయ్యాడు? ఆ గోలీకాయలు పంచుకోవడం యింకా దెమల్లేదేమో వాళ్ళకు! అన్నట్టు ఆ శంకరంగాడు ఎంతకూ తిరిగిరాడే!"

"నాకు వెయ్యేళ్ళాయుస్సు! తలచుకుంటూ వుండగానే వచ్చేశాను" అంటూ రెక్కలల్లార్చుకుంటూ క్రిందికి వ్రాలుతున్న గరుత్మంతుడిలా చేతు లాడించుకుంటూ రంగంలో దూకాడు శంకరంగాడు.

వచ్చినవాడు వచ్చినట్టుండకుండా గసపోసుకుంటూ ప్రారంభించాడు. "అమ్మా, ఆండాళమ్మగారంటే ఏమిటో అనుకున్నాను. వెయ్యిప్రశ్న లడిగిన తర్వాతగాని పెట్టె తెరిచింది గాదు. అవసరంగా వూరికెళ్ళాలి.

నాన్నగారూ ఊళ్ళో లేరు. అందుకని..."

రాజేశ్వరమ్మగారు చూపులతో వారించారు. సైగలుచేసి చూశారు. కాని కుర్రాడు తన యింగితాన్ని గ్రహించే స్థితిలో లేకపోవడంతో రెక్కపట్టుకుని వాడిని బరబరా గదిలోకి లాక్కెళ్ళారు.

ఈ విచిత్రప్రపంచంలో ఎవరి గోడవ వాళ్ళది. వెళ్ళినపని దిగ్విజయంగా నెరవేర్చుకొచ్చే కామన్న సంబరం కుర్రవాడికి! వాడు అప్పుకోసం వెళ్ళివచ్చిన విషయం నాకు తెలియగూడదన్న ఆరాటం రాజేశ్వరమ్మగారికి!

ఇక జట్కా తీసుకరావడ మొకటే తరువాయి. రాజేశ్వరమ్మగారు హెచ్చరించక మునుపే వీధిలోకి వెళ్ళి రెండు జట్కాలు తీసుకొచ్చేశాను.

ఆ రోజు రైలు అరగంట ఆలస్యంగా వచ్చింది. ఆ అరగంటలో రాజేశ్వరమ్మగారి ద్వారా నాకు బోలెడన్ని విషయాలు తెలిశాయి— ఆమె నాన్నగారు సబ్ కలెక్టరుగా పనిచేసి ప్రస్తుతం పించను పుచ్చుకుంటున్నారు. అన్నగారు లంకభూముల్లో పొగాకు పండిస్తున్నాడు. అతడొక్కడే నలుగురైదుగురు ఐ. ఏ. యస్. ఆఫీసర్ల పెట్టు. తమ్ముళ్ళలో ఒకడు అడ్వొకేటు. అతడు వెయ్యిరూపాయలకు తక్కువ కేసైతే గుమ్మందాటి ఈవలికి రానివ్వడు. చిన్నతమ్ముడు డాక్టరు. అతడు వరకట్నంతో ఫారిన్‌గూడా వెళ్ళి కొత్తకొత్త వ్యాధుల్ని నయం చేయడంలో తరిబీదు పొంది వచ్చాడు. పోగా అన్నదమ్ముళ్ళకు తగ్గట్టు అక్కచెల్లెళ్ళుగూడా. ఆ పాయలోనే బ్రతుకుతున్నారు. పెద్దచెల్లెలి భర్తకు బస్సులున్నాయి. చిన్న చెల్లెలి మొగుడికి బస్సులు లేవుగానీ మోటారుసైకిలుంది. ఆతడు గొప్ప యింజనీరు. ప్రభుత్వం అతడు కట్టమన్న చోట ప్రాజెక్టులు కడుతుంది. వద్దంటే మానేస్తుంది.

అదృష్టవశాత్తు, అరగంట ఆలస్యం అయినప్పటికీ రైలు రానే వచ్చేసింది!

స్టేషనునుంచీ సరాసరి ఆఫీసుకు వెళ్ళాను. జట్కాలో కూర్చున్నందుకు కాదుగానీ గడచినరాత్రి సరిగా నిద్రలేక ఒళ్ళంతా నలతగా వుంది. సెలవుపెట్టి యింటికి వెళ్ళాను. భోజనం చేసి పడుకోగానే గాఢంగా నిద్రపట్టింది.

నిద్రలేచేసరికి జానకి పట్టుచీరలో ముస్తాబై "అమ్మవారికీ రోజు పచ్చలహారం వేస్తారటండీ! పొరుగింటి పిన్ని రమ్మంటోంది. వెళ్ళొస్తాను" అంది.

"ఐతే ఒకపని చేద్దాం జానకీ! ఎలాగూ నీకు హిందీ సినిమాలు నచ్చవు. నువ్వు గుడికి వెళ్ళు. నేను సినిమాకు వెళ్ళొస్తాను" అన్నాను.

కలతలను పరిహరించి మనసు కొంత వుల్లాసాన్ని చేకూర్చి పంపగలదనుకున్న సినిమాగూడా ఆరోజు నా వూహాకు తల్లక్రిందులుగా పరిణమించింది. చలన చిత్రాల పాలిటి మహారాజ పోషకులైన పావలాటిక్కెట్టు ప్రేక్షకుల పరిభాషలో అది ఏడ్పు ముఖం కడుక్కున్నట్టుగా వుండడంతో ఎప్పటికప్పుడే లేచి రావాలనుకుని ఓపిక లేక అలాగే కూర్చుండి పోయాను. వెండితెరపైన సినిమాకథ తన కిష్టంవచ్చినట్లల్లా పారిపోతుండగా, కనురెప్పలమీద నిద్రాదేవత ఆనందలాస్యం సలుపుతుండగా, ఆ కథకూ ఈ నిద్రకూ మధ్య బెంచీలోని నల్లులు మధ్యవర్తిత్వం నెరపుతుండగా ఆట ముగిసింది.

అమావాస్య చీకటి. అందుకు తోడూ ఆకాశాన మబ్బులు నడయాడుతున్నాయి. ఎడారిలాంటి చీకటిలో వెలుగు ఒయాసిస్సులను ప్రసవించలేక వీధి దీపాలు సైతం వెలవెల పోతున్నాయి.

దూరం కాస్తా కలిసివస్తుందని సందుగొందుల్లోపడి నడువసాగాను. ఇళ్ళలోపల వుక్క-కు తట్టుకోలేక వీధుల్లోనే బిచాణా పరచుకున్న పురజనుల మధ్యనుంచీ త్రోవచేసుకుని చరచరా నడచి పోతున్నాను. ఉన్నట్టుండి ఒకచోట అనుకోని అవాంతర మొకటి ఎదురైంది. సైడుకాలువలో పికాల్లు తిరుగుతున్న కుక్కలు కొన్ని మొరుగుతూ పైపైకొచ్చేశాయి. దిక్కులు దోచక ఆ సందులోనుంచి వేరొక సందులోకి దారితీశాను. దూర్వాసుని వెన్నంటిన విష్ణుచక్రంలాంటి జాగిలం ఒకటి నేను పరుగుదీస్తే అదీ పరుగుదీసి, నే నాగిపోతే అదీ ఆగిపోయి చివరకు నన్నొక తాయరోడ్డుపైన దిగవిడిచి మాయమైపోయింది.

పట్టణంలో ఏ భాగంలో వున్నానో తెలుసుకోగోరి తల పైకెత్తి చుట్టూరా కలయజూచాను. ఎట్ట ఎదుట తాశీల్దారుగారి మేడ. మేడ పైన గదిలో వెలుగుతున్న దీపం. దీపకాంతి కడ్డంగా కిటికీ చువ్వలకు ఆనుకుని నిలబెచ్చిన సిల్హౌట్టులాంటి నీడ!

నా చేయి అప్రయత్నంగా జేబులోకి వెళ్ళింది. అక్కడ రాజేశ్వరమ్మగారిచ్చిపోయిన తాళం చెవి భద్రంగావుంది.

గేటు తెరచుకుని గరాజ్ లో పలికి వెళ్ళాను.

"ఎవరూ, ఎవరూ" అన్నారు శేఖరం గారు.

"నేనే సండీ! రాజుని. తాళంచెవి నాచేతి కిచ్చిపోయారు. పొరబాటుజరిగింది. మీరీ రోజే క్యాంపునుంచి తిరిగివస్తారనుకోలేదు..."

నీడలాంటి శేఖరంగారిలో చలనం లేదు. కనీసం నా మాటలాడుటకు అర్థమైన సూచనలుగూడా లేవు.

ఒకటి రెండు నిమిషాలు అలాగే గడచిపోయాయి.

"వెళ్లమంటా రాసార్!" అన్నాను.

శేఖరంగారు గిరుక్కున వెనుదిరిగి కనుమరుగైపోయారు. మరికొంత సేపటికి క్రింద తలుపుతీసిన శబ్దం వినిపించింది.

తలుపు తెరచుకుని నేను హాల్లోపలికి వెళ్ళేసరికి శేఖరంగారు మేడ మెట్లెక్కుతున్నారు. కాలికేదో తగలడంతో క్రిందికి చూచాను. విరిగిన తాళం!

మెట్లెక్కి నేనూ గదిలో ప్రవేశించాను.

ఆ గదిలోని వస్తువులన్నీ చిందరవందరైపోయివున్నాయి. శేఖరంగారి ఫ్యాంటూ, కోటూ మంచానికిఅడ్డదిడ్డంగా పడివున్నాయి. ఆయన లుంగీ చుట్టుకున్నారు. బనీను వేసుకున్నారు. కుర్చీలో కూర్చుని టేబిలుపైకి వ్రాలిపోయి వేళ్ళతో జుత్తు పీక్కుంటున్నారు.

కొట్టుకుంటుండగా నేను శేఖరం గారిని చూచాను. చిరాకుతో చిటపటలాడుతుండగా నేను శేఖరంగారిని చూచాను. దాదాపు ఒక్క సంవత్సరంనుంచీ యెన్నో రకాలైన భావావేశాలు శేఖరంగారి ముఖంలో రంగులు మార్చుకుంటూ వుండగా నేను చూచాను. కాని యిలాంటి సరిదీని పరిస్థితిలో మాత్రం నేనెన్నడూ ఆయనను చూడలేదు. లాటీలతో పోలీసు బాదిచిన తర్వాత, కంచీలతో వాయించిన తర్వాత బాధకు సహించుకోలేని ఖైదీలా ఆయన పళ్లు బిగకరచుకుని, కళ్లుకుంచించుకుని కుతకుతమని వుడుకుతున్న కుర్రాకులా కూర్చున్న కుర్చీలో క్రుంగిపోతున్నారు.

"ఇదేమిటిసార్! ఇలాగైపోతున్నారెందుకు? ఏం జరిగింది?" అంటూ దగ్గరగా వెళ్లి నిల్చున్నాను.

శేఖరంగారు లేచి నిదానుగా కూర్చున్నారు. నాకళ్లల్లోకిసూటిగా చూస్తూ "పాపం బ్రద్దలుకావడమంటే ఏమిటో నీకు తెలియదా రాజూ?" అన్నారు. అనడమేమిటి? ఆక్రోశించారు.

"ఏదో చిన్న విషయానికి మీ రిలా బేజారుపడిపోతున్నారు. మరేం పరవాలేదు. కాసేపు నెమ్మదిగా మంచంపైన పడుకోండి." అన్నాను.

"రాజూ!" లేచి నిల్చున్నారు శేఖరంగారు. చేయిపట్టుకుని నన్ను కిటికీ దగ్గరకు తీసుకెళ్లారు." చూడు. తెలియటంలేదూ? ఆతడెవరో నీకు తెలియటంలేదూ?" అంటూ గోడ ప్రక్కకు తప్పుకున్నారు.

రోడ్డు కెదురుగాపున ఓ చిన్న బంకు. బంకు కెదురుగా ఓ బెంచీపైన కూర్చుని ఓ బక్కపలచటి పెద్ద మనిషి ఎత్తిన తల దించకుండా ఈ కిటికీ వైపే చూస్తున్నాడు.

"చూచావా రాజూ! అతడెవరో నిన్నటి వరకూ నాకూ తెలియదు. ఈ రోజే తెలిసింది. ఉదయంనుంచీ ఆతడు నన్ను వెంటాడుతున్నాడు. జవాను పుల్లయ్యను దూరంగా పిలిచి మూడు నాళ్లు వాకబుచేశాడు. అతడు సి. ఐ. డి. ఘుంమగా వచ్చేశాడు. అతని నంబరే వారంట్ వస్తుంది. తెలిసిందా రాజూ! పాపం బ్రద్దలు కావడమంటే ఏమిటో తెలిసిందా రాజూ?

"నా పాపాల జాబితా చాలా పెద్దది" మళ్లీ కుర్చీలో కూలబడి చెప్పుకపోసాగారు శేఖరంగారు "ఒడ్డు చేరుకున్న తర్వాత తెప్పను ముక్కలు చెక్కలుచేసి తగలబెట్టిన పాపం కట్టుకుడుపక మానేదిగాదు. పందిరిపైకి ప్రాకబోతున్న పూలతీవెల్లాంటి అనురాగాల్ని మమకారాల్ని తెంపి, ప్రోగులుపోసి కాలరాచి నేలపాలుచేయడంకన్నా దారుణం మరేముంటుందిరాజూ? ఒకటికాదు, రెండుకాదు, నిండుగాపదిహేనేళ్లనుంచీ నేను ఆజ్యంపోసి అగ్నిగుండానికి కాస్తా ఉపశాంతి కలిగించాలని ప్రయత్నిస్తున్నాను. కాని ఆజ్యం పోసినకొద్దీ అగ్నినాలుకలు సాచుకుని మరింతగా ప్రజ్వరిల్లిపోతోంది. ఆ మంటలుగూడా నాఅంతాన్ని కనుక్కోకుండే వదలిపెట్టేవిగావు. కాని నాపతనానికి నేను మానవుల్ని హేతుభూతులుగా వేర్కొనడం లేదురాజూ! జలగలైనా శరీరంలోని నెత్తురును పీల్చి వేసినవీ, జ్వాలలైనా మనశ్శాంతిని మార్చివేసినవి, ఈటెలైనా అంతరాత్మను గ్రుచ్చి గ్రుచ్చి బాధిస్తున్నవీ నాపాపాలు..."

కుర్చీలో కూర్చోలేక తూలుతూ పైకి లేచి శేఖరంగారు కుప్పకూలగా మంచంపైన కూలిపోయారు.

నేను కాసేపు గదిలో పచార్లుచేశాను. స్టూలుపైన కూర్చున్నాను. మళ్లీ లేచాను. మరేం చేయడానికీ పాలుపోక గోడకు వ్రేలాడుతున్న ఫోటోలకేసి చూడసాగాను.

ఆ ఫోటోలలో ఒకటి నా దృష్టిని అరికట్టింది. ఎప్పుడోగాని నేనా ఫోటోను చూచినట్టుగుర్తు... అవును. 'ఇతడేనంటే మా చంద్రం బావ' అంటూ జానకి ఒకసారి సరిగ్గా యిలాంటి ఛాయాచిత్రాన్ని చూపించింది."

కాని చంద్రం ఫోటో ఈ గదిలో ఎందుకు వ్రేలాడుతోంది?

వరుసగా అక్కడ తగిలించివున్న ఏడెనిమిది ఛాయా చిత్రాలను చూచిన తర్వాత గాని నాకు సందేహనివృత్తి కలుగలేదు. ఒక చోట చంద్రంలో శేఖరంగారి పోలికలు కొలగా కనిపించాయి. రానురానూ ఆపోలికలే

స్థిరపడిపోయి అసలైన చంద్రం మనిషిలో మనిషిలా మటుమాయమైపోయాడు.

ఐతే ఈయన తన పేరులోని పూర్వభాగాన్ని 'సి' అన్న పొడి అక్షరంలో దాచుకున్న చంద్రశేఖరంగారన్న మాట!

ఎప్పుడు ఎక్కడ ఏ రూపంలో చంద్రాన్ని కర్కోటకుడు కాటువేశాడో నాకు తెలియదు. అతడి బాహుక స్వరూపమే శేఖరంగారు!

మంచం పైన ప్రక్కకు ఒత్తిగిల్లుతూ అన్నారు. శేఖరంగారు "ఇంకా యిక్కడే వున్నావా రాజూ! రాత్రి మించి పోయినట్టుంది. వెళ్ళు బాబూ, నువ్వు వెళ్ళు!"

ఉండి చేయగలిగిందేమీ లేక ఉదయం కలుసుకుంటానని చెప్పి సెలవు తీసుకున్నాను. ఓదార్పు మాటలకన్నా యిప్పుడు శేఖరం గారికి విశ్రాంతి అవసరం. నిద్రపోయి లేచినట్టయితే ఆయన మనసుకు కాస్త స్తిమితం చేకూరవచ్చు.

రోడ్డుపైకి వచ్చి పదిబారల దూరం నడిచానో లేదో వెనుకనుంచీ పిలుపు వినిపించింది.

"ఏమండీ! సార్! ఒక చిన్నమాట..."

మరొకరూ మరొకడూ కాదు. అతడు తాశీల్దారుగారిపైన నిగాపెట్టి తిరుగుతున్న బక్కపలచటి పెద్దమనిషి!

"మరేం లేదు. ఒక చిన్న యిన్ఫర్మేషన్ కావాలి. మీ ఉపకారం మరచిపోను. తాశీల్దారుగారి ద్వారా నాకో సహాయం కావాలి. డబ్బుకు వెనుకాడేవాణ్ణికాను. ఆయన్ను ఎలా అప్రోచ్ చేయాలో ఏమిటో ఆ విధానం నాకు తెలియడం లేదు..."

నాకు ఒళ్లు మండింది. మాటలే మంత్రాలుగా ఎదుటి వారిపైన మచ్చుపొడి చల్లి తనకు కావలసిన రహస్యాలను ఆరాతీసే పరిశోధనా కౌశలమేమో యిది! 'సీ నక్కజిత్తులు నాదగ్గర సాగవు, పో పొమ్మని దులిపి వేద్దామనుకున్నాను. కాని ఆతడు సి. ఐ. డి. ఎట్టి పరిస్థితిలోనూ అతడితో వ్యవహారం శ్రేయస్కరంగాదు.

"చూడండి సార్! తాశీల్దారుగారిలాంటి కాని పనులకు పూనుకుంటారని మీకెవరు చెప్పారో నాకు తెలియదు. నాకు తెలిసినంతవరకూ ఆయన నిప్పులాంటి మనిషి! ఇదే మీకు నేనివ్వగలిగిన యిన్ఫర్మేషను"

అతని నలా రోడ్డుపైన వదలిపెట్టి వడివడిగా ముందుకు సాగి చీకటిలో కలిసి పోయాను. కాలం ముందుకు కదులుతున్నా ఆలోచనలు మాత్రం వెనక్కి వెళ్ళున్నాయి. ఉండి వుండి ఒక ప్రశ్న నా అంతరాంతరాల్లో ధ్వనిస్తోంది — వత్తి మండుతున్న చిమ్నీలో పడిపోయి, రెక్కలు రాల్చుకుని కొట్టుమిట్టాడిపోతున్న శలభంలాంటి శేఖరంగారు చివర కేమౌతారు?

పరిపరి విధాలైన ఆలోచనలు తేనెటీగల్లా వచ్చి ముసురుకుంటున్నాయి. కాని ఎంతగా ఆలోచించినా మానవుడి చూపు అనాగతంలోకి చొచ్చుకపోదు. ఒకవేళ చొచ్చుకపోయినా ఆ చూపుకు వక్రీభవనం తప్పదు. శేఖరంగారికి విశ్రాంతి అవసరమనుకున్నప్పుడు ఆయన నిరంతరమైన విశ్రాంతినే వాంఛిస్తున్నారనిగాని, నెమ్మదిగా నిద్రపోయినట్టయితే ఆయన మనసుకు స్తిమితం చేకూరవచ్చు ననుకున్నప్పుడు ఆయన పాలిటికిక మిగిలివున్నది దీర్ఘనిద్ర మాత్రమే ననిగాని నేను భావింప లేకపోయాను.

♦ ♦ ♦

శేఖరంగారు తమ జీవిత నాటకానికి భరత

వాక్యం చెప్పుకున్న వారం రోజుల కొకనాడు ఆఫీసునుంచీ తిరిగి వస్తుండగా మార్గమధ్యంలో బక్క-పలచటి సి. ఐ. డీ. పెద్దమనిషి ఎదురయ్యాడు.

"ఏమిటండీ! తాశీల్దారుగారు పోయారటగా చాలా విచారించాను..."

అతణ్ణి సమిలి మింగివేయా లన్నంత కోపం వచ్చింది. ఐనా తమాయించుకుని "ఏం చేయగలమండీ! ఆయన బ్రతుకలా తెల్లవారింది" అన్నాను.

"మహానుభావుడు, నా కేసైనా కేసులు చూపిస్తాడేమోనని ఓ నెలజంతా ఆయన్ను వెన్నంటి తిరిగాను. ఊరికే కాదనుకోండి, నా కొచ్చే కమీషనులో ఎంతో కొంత ముట్టజెప్పాలనే నా వుద్దేశం. జవానులతో గూడా ఒకటిరెండు సార్లు సంప్రదించి చూచాను. కాని అతడు గూడా నా కంతగా వుపకరించ లేకపోయాడు. పోనీ పూరంతా మాటు మణిగిన తర్వాత కలుసుకుందా మనుకున్నాను. మీరు వెళ్లూ వెళ్లూ వేరొక విధంగా చెప్పిపోయారు. ఇంత చేశావా భగవంతుడా అనుకుని తిరిగి చూడకుండా యింటికి వెళ్లిపోయాను..."

అతడి కేసులేమిటో, కమీషనేమిటో బొత్తిగా అంతుపట్టక "ఇంతకూ మీ వుద్యోగమేమిటండీ బాబూ! పోలీసు డిపార్టుమెంటు కాదూ మీది?" అన్నాను.

"బాబ్బాబూ! నేను యిన్షూరెన్సు ఏజంటుని! కావలిస్తే నా లెటర్ ప్యాడ్ చూడండి!" అంటూ అతడు తన లెదర్ బ్యాగును తెరువసాగాడు.

( ఈ ఉపన్యాసము ఆంధ్ర విశ్వవిద్యాలయములో జరిగిన ఆంధ్రాభ్యుదయోత్సవములలో 27—12—59 నాడు చదువబడినది. కొన్ని మార్పులతో ఇచ్చట ప్రకటితము.)

జివ్వాడి గౌతమరావు | **పత్రికారచన - సాహిత్యము**

పై విషయముపై ఉపన్యాస మెక్కడ మొదలు పెట్టవలయునో నాకు తెలియుట లేదు. ఈ విషయము నెన్నివిధములుగానో విభజింపవచ్చును. అట్లు విభజింపబడిన సర్వ విషయములను గురించి మాటాడుట కిది యదనుగాదు. సమయమును చాలదు. ఆ విషయము లన్నింటిని గురించిన పరిజ్ఞానము కూడ నాకు లేక పోవచ్చును.

అసలు తెలుగు ఉపన్యాసముల శీర్షికలే విచిత్రముగా నుండును. ఆ విషయ వైశాల్య మెట్లుండుననగా కొన్నిరోజుల ఉపన్యాసములలో కూడ నది యొదుగదు. ఫలానా వారాంధ్ర సాహిత్యముపై నుపన్యసింతురని ప్రకటింపబడును. ఉపన్యాసకుల దృష్టిలో చూచిన శీర్షిక యట్లుండుటయే లాభకారి కావచ్చును. ఎన్నో పేర్లు చెప్పవచ్చును. కావలసినన్ని పద్యములు చదువవచ్చును. విషయవిమర్శ యక్కరలేకుండ ఉపన్యాసము ముగింపవచ్చును. ఏదోయొక స్వల్పవిషయమున కొకడు వాల్మీకి యన్నచో, ఒకడు యుగకర్త యన్నచో తత్తదభిమానులచేత బాగుబాగనిపించుకొని బయటపడవచ్చును.

అట్టి నిరర్థకములైన సమీక్షలు నేను చేయబోవుటలేదు. తెలుగు దేశములో పుట్టిన మొట్టమొదటి పత్రికయేది? అది యెందు కొరకు పుట్టినది? తన లక్ష్య సాధన కదిచేసిన కృషి యెంత? పత్రికలు పుట్టిననాటికి నేటికి వాటి సంఖ్యలో కలిగిన వృద్ధి యెంత? ఈ మొదలైన విషయములు నేను ముట్టుకొనబోవుట లేదు. ముట్టుకొందమన్నను తెలుగు దేశములో ఒక మారుమూల నివసించుచున్న నాకు ఈ విషయము సేకరణకు తగిన సౌకర్యములులేవు. ఈ పేర్లు, సంఖ్యలువ్రాసి ఒక డాక్టరేటు సంపాదించుకొనుటకైన నాకు వీలు లేదు. అందుచేత మాదృశుల కది ఫలితము లేని కష్టము.

తను తమ సిద్ధాంతములందలి అభిమానములను పురస్కరించుకొని పత్రికలు పుట్టును. ఆ సిద్ధాంతమునందా పత్రికకున్న యభినివేశమునుబట్టి దాని ప్రచారమార్గమునుబట్టి ఆ పత్రికకొక వ్యక్తిత్వ మేర్పడుటయో యేర్పడక పోవుటయో జరుగును. నే నెక్కువగా వార్తా పత్రికలను గురించి ముచ్చటించ దలచుకొనలేదు. వార్తా ప్రచురణమే వాటి ముఖ్యోద్దేశము, మరికొన్ని రాజకీయ పత్రికలు అవి స్వపక్ష ప్రచారమున కేర్పడినవి. ఈ ప్రచారములో మరొక గొడవయున్నది. ప్రతి పత్రికయు తాను ప్రజాభిప్రాయమునకు ప్రాతినిధ్యము వహించుచున్నట్లు నటించును. ఈ ప్రజాభిప్రాయమను నినాదము ఒక రాజకీయములవరకే కాదు. ఇది సాహిత్యములోనికి కూడ ప్రాకినది. ప్రజలనగా నెవరు? అని యాలోచించిన వారు మాత్రము కనబడుట లేదు. ఈ గేయమును విని సభలోనున్న ఏబదివేలమంది కన్నీరు గార్చిరి. ఈ నాటకమును చూచి ప్రేక్షకులు కడుపుబ్బ నవ్విరి. మొదలైన వాక్యములు తద్రచనల యుత్తమత్వమునకు నిరూపకములుగా, ఆశ్రోతలయో లేక ప్రేక్షకులయో మెచ్చుదల దానికొక ప్రమాణముగా నేడు చెప్పబడుచున్నవి.

జన్మించిన మానవులందరును ఆలోచనాపరులు కారు. వారిలో చాలమందికి విశేష విషయములు బట్టవు. మరి ఆ విషయమునుగురించి విమర్శచేయుట దానినిగూర్చి ఒక నిర్ణయమునకు వచ్చుట ఎన్నికలలో ఓట్లు వేసినంత తేలికపనిగాదు. ఆ ఓట్లు వేయుటలోకూడ తమ బుద్ధిని ప్రయోగించి ఓట్లు వేయువారరుదు. తమ కులము పెద్దనుజూచియో, తమ కుపకారము చేసినవాని మాటనుబట్టియో చాల మంది ఓట్లు వేయుచున్నారు. ఎక్కువ ఓట్లు సంపాదించినంత మాత్రమున వారి మార్గము సరియైనదని చెప్పుటకు వీలు లేదు. వారెక్కువ బలముకలవారు కావచ్చును. తమ మాటవినని వారిని గూషించు శక్తి వారి కధికముగానుండవచ్చును. వారిని వారు జైలులోకూడ పెట్టింపవచ్చును. ఇదంతయు వేరు. మార్గము యొక్క నిర్దుష్టత్వము వేరు.

మరియు రాజకీయ విషయమున నెవ్వరు ప్రజలో, ఎవరియభిప్రాయము గౌరవింపదగినదో సాహిత్యవిషయమున వారు ప్రజలు కారు. వారి యభిప్రాయమునకు గౌరవమీయవలసిన యవసరములేదు. ఒక గణితశాస్త్ర సిద్ధాంతమున్నది. ఆ సిద్ధాంతమునందలి సత్యాసత్యములు నిర్ణయించుటకు కవులు రాజకీయవేత్తలు సమర్థులుకారు. ఆ శాస్త్రము నభ్యసించినవారు, దాని లోతుల నెరిగినవారు, దానిలోని రహస్యములను పట్టుకొనగలిగినవారు, వారు మాత్రమే ఆ నిర్ణయమునకు సమర్థులు. సర్వశాస్త్రములలోని గూఢవిషయములు తత్తత్పరిజ్ఞాతలకే తెలియును. ప్రజాభిప్రాయమన్నట నికషోపల మగుటకు వీలు లేదు. సాహిత్య విషయములో కూడ నంతే. అయినప్పటికి ప్రజలన్నమాట సాహిత్యములో మాటిమాటికి ఎందుచేత వినబడుచున్నది ?

నేటి సాహిత్యము ద్విధావిభక్తమై యున్నది. ఒక మార్గము పూర్వ సంప్రదాయానువర్తి. రెండవది తద్వ్యతిరేకి. మొదటివారు సాహిత్య పరమార్థము రసమని యంగీకరింతురు. రెండవవారు సాహిత్యము ప్రజోపయోగము కొరకని ప్రచారము చేయుదురు. అడుగడుగున ప్రజలను శబ్దము ప్రయోగము చేయు వారే రెండవవారే.

ఈ యుభయులు కానివారు కొందరుండవచ్చును. కొంత యది కొంత యిదియైన వారు కొందరుండవచ్చును. ఎవరు కనపడినప్పుడు వారిమార్గమే గొప్పదని యంగీకరించువారు మరికొందరుండవచ్చును. గాఢశీలురు కాని అట్టి వారిని గూర్చి విచారించుట వ్యర్థము. సాహిత్యము వారికి వ్యాపారము వంటిది. అందుచేత పాపము! వారు సర్వసములు. ఉభయ సిద్ధాంతములకు లొంగునట్లుగా వ్రాయుట, వానిని సమన్వయించుటకై ప్రయత్నము చేయుట వ్యాపారవృద్ధికి వీరవలంబించు మార్గములు.

ఈ భేదము ననుసరించి సాహిత్య పత్రికలలోని భేదములు చూచుకొనవచ్చును.

సరే. ప్రజోపయోగ మన్నమాట విచారింతము. మొదటివారికి సాహిత్య పరమార్థము రసము కదా! ఆ రసములో ప్రజోపయోగము నిహితమై యున్నదా లేదా ?

రసమునకు ప్రయోజన మానందము. రససిద్ధి కలిగినచోట జీవు డానందము పొందుట సహజము. ఆనందము పొందుట యనగా సుఖమనుభవించుట. ఈ జగత్తునందు మానవుడు చేయుచున్న సర్వప్రయత్నము ఇతోధిక సుఖ సాధనకేగదా! ప్రజలలోని యొక భాగమైన పాఠకుడు కావ్యము

చదిని ఆనందము పొందుచున్నాడు. సుఖమనుభవించుచున్నాడు. ఇది ప్రత్యక్షమైన విషయము. నిరాకరించుటకు వీలులేనిది. ఇతర ప్రయోజనము లేవైన నున్నచో అవి యింత ప్రత్యక్షములుకావు. అందుచేత రసము పరమార్థముగా కలిగిన కావ్యమే ప్రజోపయోగకరమైనది. ఇతరముకాదు. సుఖము కలిగించుట యందది సమర్థమగుట లేదుకనుక.

రెండవవారి ప్రజోపయోగము కావ్యగతమైన విషయమునకు సంబంధించినది. ఈ సమాజము దోషభూయిష్ఠముగా నున్నది. ఇందులో భేదము లధికము. ఒడిదుడుకు లధికము. దారిద్ర్యబాధ యధికము. వీనినన్నింటిని తొలగించి సర్వజనులు సమానముగా, సుఖముగా బ్రతుకగల యొక సమాజనిర్మాణము చేయవలయును. తదున్ముఖముగా వ్రాయబడిన కావ్యము, తత్ప్రచారమునకై వినియోగింపబడిన సాహిత్యము కధిక ప్రయోజనకారులు. ఇది వారి వాదనలోని సారాంశము.

ఆ సమాజ మెప్పుడో స్థాపింపబడుననియే యనుకొందము. ఈ సాహిత్య సృష్టియే ఆ సమాజస్థాపనకు దారితీయునని యేమి నమ్మకము? ఒకవేళ దారితీయనిచో ఈ కృషి నిష్ప్రయోజనము. భవిష్యత్కాలములో ఎప్పుడో యెకప్పుడు జరుగునని యూహింపబడుచున్న ఒకానొక విషయమునుగూర్చి వ్రాయబడుచున్న వ్రాతలు ప్రజోపయోగకరము లనుటలోని సామంజస్యము విచార్యము. అందుచేత పాఠకుని హృదయము నాసందింపజేయగల ఫలవంతమైన కృషికే ఉపయోగమున్నది. తదితరమైనది ఉపయోగములేనిది.

ఈ సిద్ధాంతావలంబకులచేత మిక్కిలిగా దుర్వ్యాఖ్యానము చేయబడిన మాట "విశ్వశ్రేయఃకావ్యమ్" అనునది. ఆ మాటకును వీరు చెప్పు అర్థమునకు సంబంధములేదు. శ్రేయస్సు అన్నశబ్దమున కర్థము విచారింపబడుటలేదు. శ్రేయస్సనగా లౌకిక సుఖము కాదు. కఠోపనిషత్తు చదివినచో తెలియును.

పైన చెప్పబడిన వారిలో రెండవవారు తమ మార్గమున కభ్యుదయ మార్గమని పేరు పెట్టుకొన్నారు. సంప్రదాయాను వర్తులైన వారు పేదలకుతిండి యుండకూడదని వారు సుఖముగా బ్రతుకగూడదని యున్నట్లెక్కడను కనబడదు. కాని ఈయభ్యుదయ వాదులు వారి యందీ యభిప్రాయము లారోపింతురు. అరోపించి వారికి అభ్యుదయ నిరోధకులని పేరు పెట్టుదురు. సంప్రదాయము ప్రజల నణచి పెట్టుచున్నదని వీరిభ్రమ. అందుచేత దానిని విచ్ఛిన్నము చేయవలయునని పట్టుదలపెంచుకొందురు. అభ్యుదయ వాదులు నిజముగా విచ్ఛిన్నకారులు.

అభ్యుదయగాములు, తన్నిరోధకులు — ఈ శబ్దములను గూర్చి కొంత విచారణజరుగవలసిన యవసరమున్నది. నేటి తెలుగు పత్రికాలోకములో అనేక శబ్దములు వాని యర్థమును గూర్చిన విచారణలేకుండ వాడబడుచున్నవి. ఈ శబ్దము లటువంటివి.

అభ్యుదయ వాదులకు సమాజవాదము మూలసిద్ధాంతము. ఈ సమాజవాదము మనుష్యుడు, వాని యధికారములు; ఎంతసేపటికిని వీని చుట్టు తిరుగుచున్నది. వానిని దాటి పోవుటలేదు. మనుష్యుని దాటియున్న అనంతమైన సృష్టి వీరి దృష్టికందదు. సర్వపనులు సమానము — నిజమే. సర్వప్రాణు లెందుచేత సమానముకావు? కాదన్నచో మనుష్యులు మాత్రమెందుచేత సమానము కావలయును? ఏదోయొకటి అాదరియందు సమానముగా

ప్రకాశించుచున్నదన్న విషయమొప్పుకొనని చో సమానత్వమన్న వాదనకర్థములేదు. ఆ ప్రకాశించుచున్న యొకటె మనుష్యులయందే ప్రకాశించుచున్నది. కాని కోళ్ళయందుగొఱ్ఱెల యందు ప్రకాశించుట లేదా? పరపీడన పరాయణత్వము కూడదని బోధించు సమాజ వాదము ఆజంతువులను కోసికొనితినకూడదని బోధింపదేమి? ఒక హేతువాదము మొదలు పెట్టితిమి? ఆ హేతువు వెంట కొంతదూరము సాగి అక్కడ యాగిపోవుట అభ్యుదయ లక్షణమా? అది సాగినంత మేర దాని వెంట బడి పోవుట అభ్యుదయ లక్షణమా? ఆ లెక్కన చూచినచో 'ఈశావాస్యమిదం సర్వం' అని చెప్పినవాని కన్న సమదృష్టి కలవాడుండుట యసంభవము. అది సంపూర్ణదృష్టి. ఇదినడచి నడచి మనుష్యునివద్ద యాగుచున్నది. మరి యు మాటాడినచో మనుష్యులలో తమ పక్షమునకు సంబంధించిన వారివద్దయాగుచున్నది. ఇది విభక్తదృష్టి. నిజమైన సమాజ వాద మాత్మ సిద్ధాంతములో పర్యవసించవలయును. కాని ఆయాత్మ సిద్ధాంతమును ప్రతిపాదించిన వారిని వీరు అభ్యుదయ నిరోధకులని నిందింతురు. నాస్తికత్వమునకు సమాజ వాదమునకు లంకె. జాగ్రత్తగా ఆలోచించినచో ఇవి రెండును పరస్పర విరుద్ధము లని తేలును. అభ్యుదయ నిరోధకశబ్దము అర్థరహితముగా ప్రయోగింపబడు చున్నదని తేలును. విభక్తదృష్టికల వానిని అభ్యుదయ నిరోధకుడనుట న్యాయమగునేమో కాని సమదృష్టికలవాని ననుట న్యాయముకాదు.

ఇట్టిదే పాత క్రొత్తలగొడవయున్నది. ఈ శబ్దములు కూడ ఒక సిద్ధాంతమును గూర్చి సరియైన విచారణ జరుగకుండ అడ్డము వచ్చుచున్నవి. వాదము సన్మార్గమును బట్టించుటకు వీలు కల్గించుచున్నవి. వ్యావహారిక భాషకు వ్యతిరేకముగా ఒకడు వాదించును. వాని యుపపత్తులకు సమాధాన మొసగుట వదలి వానిని పాతవాడని నెక్కిరించుట జరుగును. జనుల నిత్య జీవనమునకు సంబంధించిన చర్చ ఎప్పుడును పాతబడదు. మనుష్యుడు కోతినుండి పుట్టినాడు. తెలుగు ద్రావిడ భాషాజన్యము. ఇటువంటివి పాతవికా వచ్చును. ఎందుకనగా ఆయా వాదనలేమైనను వాని వాని ప్రస్తుతస్థితికి భంగములేదు. భాష జనుల నిత్య వ్యవహారమునకు సంబంధించినది. దాని మంచిచెడ్డలతో, వ్యవస్థావ్యవస్థలతో మనకు ప్రసక్తియున్నది. దానిని గురించి వాదనను సహించలేనివాడు మృత్పిండమువలె తానున్న చోటినుండి కదలజాలనివాడు. వ్యావహారిక భాషోద్యమము బయలుదేరిన మొదటిరోజులలో గ్రాంధిక భాషా పక్షమున ఇటువంటి మృత్పిండములు కొన్ని యుండెడివి. కృతకభాషకు వారాచార్యులు, సరిగా అటువంటివారే నేడు వ్యావహారిక భాషాపక్షమున బయలు దేరినారు.

ఆస్తికతా నాస్తికతలను గురించిన చర్చ యున్నది. అది యేనాటిదో చెప్పుట కష్టము. నేటికిని సాగుచునేయున్నది, భేద మెక్కడ నున్నదనగా ఆయా కాలమును బట్టి ఆసిద్ధాంతమునకు బలముచేకూరుటయో అది బలహీనమగుటయో జరుగును. నాస్తికమతమునకాచార్యులు బృహస్పతి. ఆయన యేకాలము వాడో? ఆయన శిష్యులందరిని పాతవారికింద లెక్కగట్టినచో నెట్లుండును. ఒకానొక కాలములో నాస్తికమతమైన బుద్ధమతమునకు మిక్కిలి ప్రాబల్యము కలిగినది. మరలకొంత కాలమునకు దాని ప్రాబల్యము క్షీణించినది. నేటి కాలములో మరలననేక కారణములను

పురస్కరించుకొని దానిని గురించిన ప్రచారము విరివిగా జరుగుచున్నది. శంకరాచార్యులు బుద్ధునికన్న యర్వాచీనుడు. మరి నవీన బుద్ధులు బుద్ధునివైపున కెక్కువ మొగ్గు కలవారు. బుద్ధమతమును గురించి మాటాడు వారందరిని పాతవారన్నచో నెట్లుండును? అందుచేత సిద్ధాంతములయొక్క మంచిచెడ్డలను గురించియే చర్చించవలయును గాని అది పాతబడినదని దానిని గురించి పరమ ప్రమాణభూతమయిన చివరివాక్యము చెప్పబడినదని తలచుట మూఢవిశ్వాసమునకు లక్షణము. గ్రాంథిక వ్యావహారిక భాషల చర్చ పాతబడుటకు వీలులేనిది. పసిపిల్లలు క్రొత్తయంగీల కొరకేడ్తురు. ఆ గుడ్డమంచిదా కాదా యన్న విచక్షణ వారి కుండదు. ఉచితానుచితముల విచక్షణవదలి కేవలము క్రొత్తదానియందు మోహము పొందుట బాలబుద్ధుల లక్షణము.

అందుచేత ఏదైన చర్చకు పూనుకొను వారీ వట్టి ప్రచారమునకు సంబంధించిన శబ్ద జాలమును పరిహరించి పూనుకొనవలయును. లేనిచో నిష్పక్షపాతమైన విమర్శకు తావు లేదు. అదిలేనంతవరకు సత్యములు బయల్పడదు.

పత్రికలను గురించి యాలోచించుచున్నప్పుడు ఈ గ్రాంథిక వ్యావహారిక భాషలను గురించినచర్చ మిక్కిలి ముఖ్యమైనది. భాషను వదలి పత్రిక యుండుటకు వీలు లేదు.

ఈ చర్చ మిక్కిలి జాగ్రత్తగా జరుగవలసినపని. ఈ గ్రాంథిక వ్యావహారిక భాషల లడాయి మూలముగా జరిగినంత నష్టము తెలుగుభాషకీ యేబదియేండ్లలో మరొకదాని వలన జరుగలేదు.

అసలీ వాదములకు పేర్లు సరిగా కుదురలేదు. వ్యావహారిక భాషోద్యమ నాయకులు తాము దండెత్తిన భాషకు గ్రాంథిక భాష యని పేరు పెట్టుటవలన మిక్కిలి యనర్థము వాటిల్లినదని నా యభిప్రాయము. వ్యావహారిక భాషకు మూలపురుషులైన పెద్దలను దూషింపవలయునని నాకు లేదు. ఏ పని యొక్క మంచిచెడ్డలనైనను దానివలన కలిగిన ఫలితములవలననే నిర్ణయించుటకు వీలగును. ఒక యుద్యమమునకు నాయకుడైన వాడు తన యుద్యమము భవిష్యత్కాలములో ఏ ఫలితము నిచ్చునో యూహింపగలిగి యుండవలయును. నాటిపెద్దలు తమ యుద్యమముయొక్క ఫలితములను గురించి యాలోచించుటకు సమర్థులు కాలేదని చెప్పుటకు సాహసించుచున్నందులకు నన్ను మీరు క్షమింపవలయును. గ్రాంథిక భాషా వ్యతిరేకత దేశములో సరియైన భాషాభివృద్ధికి తోడ్పడలేదు సరికదా ప్రాచీనకావ్య భాషయందు నిరాదరణము కలిగించినది. అది భాషావ్యవస్థ చెడిపోవుటకు మూలకారణమైనది.

నిజముగా దండెత్తవలసినది అసహజమైన భాషపై. అది యేకాలమునాటి దైనను సరే. ఎచ్చట నున్నను సరే. ఆ దృష్టితో చూచిన తెలుగు కావ్యములలోని భాష అసహజమైన భాష. అసహజమైన భాషకాదు. నేడు వ్యావహారిక భాషపేరుతో వ్రాయబడుచున్నదే అసహజమైన భాష. అది వ్యావహారికము. ఇది అవ్యావహారికము. ఇది కొంత యాశ్చర్యము కలిగింపవచ్చును. కొంతనవ్వు పుట్టింపవచ్చును. దయచేసి శాంతముగ యాలోచింప వలయునని కోరుచున్నాను.

వ్యావహారిక భాషయనగా నేమి? తెలుగువాడు మాట్లాడుచున్నప్పటి వాని నైజ

రిని వదలి వాడుచ్చరించునట్లుగా వ్రాయుట వ్యావహారిక భాషయగునా? ఒకానొక భావమునకు తెలుగువానినోట ఏ విధముగా అభివ్యక్తి జరుగునో ఆ యభివ్యక్తిని బట్టుకొని అట్లుగా భావమును వ్యక్తీకరించుట వ్యావహారిక భాషకాదా? మొదటి దానికి ప్రమాణము నేడు పత్రికలలో ప్రచురింప బడుచున్న రచనలు. రెండవదానికి ప్రమాణములుపూర్వ కావ్యములు. నేటి రచయితలు వ్రాయుచున్న భాషలో తెలుగు అభివ్యక్తీకరణ పద్ధతి లేదు. ఎందుకనగా మన రచయితలలో చాలమందికి తెలుగు ప్రజాజీవనముతో సంబంధము లేదు. పట్టణములలో నివసింతురు. ఆ సంకుచితమైన వాతావరణముదాటి వారుపోరు. ఏదో కొంత వ్రాయుదురు. ఆ వ్రాసినదానిలోని భాష తెలుగువానికి విజాతీయము. ఆ శబ్దములు మాత్రము ఒకానొక ప్రాంతములోని తెలుగువారల్లు యుచ్చరింప వచ్చును. ఆ భావమునకు ఏ తెలుగువాని నోట కూడ అభివ్యక్తి యట్లు జరుగదు. మరి ఉచ్చారణనే ప్రధానముగా గైకొందమన్నచో ఏ ప్రాంతపు టుచ్చారణను ప్రధానముగా గైకొనవలెను. వ్యావహారిక భాషకు వ్యాకరణములు సంతరించినవారు ఒక జిల్లాలోని యుచ్చారణనే దానికి ప్రమాణముగా యేల గైకొనవలయును. 'వచ్చాడు' అని నేనెందుకు వ్రాయవలెను? మా ప్రాంతములో మాటాడినట్లువ్రాసినచో వ్యావహారిక భాషకు ప్రమాణ భూతులైనవారు నెక్కిరింతురు కాదా? ఒకటి రెండు జిల్లాల భాషను సర్వాంధ్ర ప్రజల నెత్తిమీద రుద్దుటకు ప్రయత్నముచేయుట అభ్యుదయమా? ప్రజాస్వామిక సిద్ధాంతము లోనిభాగమా? అందుచేతనే వ్యావహారిక భాష పేరుమీద నేడు పత్రికలలో వ్రాయబడుచున్న భాషయంతయు కృష్ణాజిల్లా బ్రాహ్మణ భాషాదాస్యముక్రింద పరిణమించినదని నేను జయంతిలో వ్రాసితిని. ఆ మాటకు కొందరికి కోపము వచ్చినది. కొన్ని యథార్థవాక్యములు మిక్కిలి కఠినముగానుండును. హృదయములో ఆ మాట సత్యమని ఎంత యనిపించినను పైకి ఒప్పుకొనుటకు బుద్ధిపుట్టదు. నేను వర్ణద్వేషము కలిగించుటకే మాటయన్నానని వ్రాసిన మహానుభావులు లేకపోలేదు. వారికి నమస్కారము. అంతకంటె చేయగలిగినది లేదు. కాని "బ్రాహ్మణాదులు వాడుకొనే నాగరికమైన భాషను పండితులు గ్రామ్య మనకపోవడము ఉచితమని భావిస్తాను" అని గురజాడ అప్పారావు పంతులుగా రేదృష్టిలో వ్రాసిరి? శిష్టాశిష్ట భేదమెందుకు రేకెత్తించ బడినది? పూర్వకావ్యములలోని భాష కీభేదములు లేవే? అది ప్రాంత భేదములు వర్ణ భేదములు లేనిభాష. ఒక ప్రాంతముయొక్క అధికారము లేక వర్ణముయొక్క అధికారము భాషయందు స్థాపింపవలయునని చూచుట అభ్యుదయ విరోధకత్వమునకు ప్రథమ లక్షణము. అందుచేత ఆశ్రయింపవలసినది తెలుగువారి యభివ్యక్తినిగాని ఉచ్చారణనుగాదు.

'ఎట్టు పురాణముల్ పదియు నెన్మిది
చెప్పితి నట్టు వేదముల్
కట్టితి వేర్పరించి నుడికారము సొంపెస
లార భారతం
బెట్టు రచించితీవు ముని యట్టియుతొక్క
దినంబు మాత్రలో
పొట్టకు లేక తిట్టెదవు పుణ్యగుణంబుల
రాశి కాశికన్.'

'ఓయి దయావిహీనమతి ఊరక యీ
పసిబిడ్డ కొట్టగా

చేయెటులాడె నేటికిది చేసినదేమి ?
వృథా శపింతురే
బోయవె ? ఆమలోడునను పుట్టవె ?
శాపనిమిత్తమే తపం
బీయెడ నున్న శాంతిపరు లేమను
వారలు నీ చరిత్రకున్'

ఈ పద్యములలోని భాష గ్రాంధికమని త్రోసిపుచ్చుటకు వీలున్నదా ? ఈ భాష సర్వాంధ్ర ప్రజలకు దగ్గరగానున్న సహజమైన భాష. వేయియేండ్ల తెలుగు సాహిత్య చరిత్రలో ఎప్పుడో వందయేండ్లలో వెలువడిన కొన్ని గ్రంథములను లక్ష్యము చేసికొని సర్వకావ్యభాషను తిరస్కరించుట న్యాయముకాదు. తరువాత తరువాత వచ్చిన అనేక తెలుగు ప్రబంధములకు ఆదర మెక్కడను లేదు. వానిని చదువు వారే లేరు.

మరియు పంటి బిగువునకై ఎంతవాదించినను సర్వకాలములందు రచనావ్యవహారము వేరు వాగ్వ్యవహారము వేరుగానున్నది. వాగ్వ్యవహారమును కొంతనియమించి కొంత సంస్కరించి దానిని రచనలో ప్రయోగింతుము. నేటికాలపు రచన నియమము లోపించిన రచన. సంస్కారము లోపించిన రచన. ఈ నియమ రాహిత్యమునకు, ఈ సంస్కార శైథిల్యమునకు పత్రికలు నూటికి తొంబది వంతులు కారణమైన వన్నచో అతిశయోక్తి కాదు.

ఒక ప్రాణవంతమైన భాష దినదినము క్షీణించి పోవుచున్నప్పుడు దానికి కారణము లేమిటని విచారింపవలసి వచ్చును. తెలుగు భాష క్షీణించుట లేదు. వృద్ధి జెందుచున్న దనుకొను వారు విచారింపవలసిన యవసరము లేదు. కాని ఈ భాష దుస్థితిలో నున్నదను కొనుచున్నవారు దానికి కారణము లేమిటో విచారించి వానిని చక్క జేయుటకు బూనుకొనవలయును. అనేకములైన శబ్దములు రచయితల అపాండిత్యమువలన భాషలోనుంచి మాయమగుచున్నవి. అనేక శబ్దములు వాని అసలు అర్థమును పోగొట్టుకొని ఇంకొక యర్థములో వాడబడుచున్నవి ఆదర్శమన్న శబ్దము మనము పత్రికలలో ప్రతిదినము చూతుము. అశబ్దము లక్ష్యమను యర్థములో వాడబడుచున్నది. దానికా యర్థము లేదు. ఇట్లనేకము లున్నవి. మరియు పత్రికా సంపాదకులకు విలేఖకులకు ఇంగ్లీషు నభ్యసించుటయందే శ్రద్ధకాని తెలుగభ్యసించుటయందు శ్రద్ధ లేదు. వార్తా ప్రసారయంత్రములు వార్తల నింగ్లీషులోనే ప్రసారము చేయును. ఆ యా శబ్దములకు సమానార్థకములైన తెలుగు శబ్దము లేవో వారికి తెలియదు. అందుచేత వారు శబ్దములను సృష్టింతురు. ఆ శబ్దసృష్టియొక్క నియమము నాశ్రయించరు. భాషాజ్ఞాన మతి స్వల్పముగా నున్నవారు కూడ చేయని దోషములు వీరి వాక్యములలో శీర్షికలలో లెక్కకు మిక్కుటముగా కనబడును. ఈ దోషము లొకదినపత్రికలలోనే కావు. సాహిత్య పత్రికలలోకూడ విశేషముగా కనపడుచున్నవి. దుష్టసమాసములు, తద్ధితముపై తద్ధితమును కూర్చు ప్రయోగములు ఏ ప్రయోజనమును సాధించుచున్నవి? ప్రాముఖ్యత ఆధిక్యత, ప్రాధాన్యత మొదలైన శబ్దములు సాహిత్య పత్రికల సంపాదకీయములలో కూడ వాడబడు దుస్థితి తెలుగుదేశములో నెందు కేర్పడినది. ఇదివరకే ఈ మార్గము పట్టినవారికి చెప్పియు లాభము లేదు. వారేమైనను పాతకొత్త లేకరువు పెట్టుటకు చాలుదురు. రాబోవు తరమునకు నాయకులైన విద్యార్థులీ విషయములను గురించి

ఇప్పటినుండి ఆలోచించుట మొదలు పెట్టి నచో కొన్ని యేండ్లలో తెలుగు బాషకీ దుస్థితి తప్పవచ్చును.

కాని బాష వృద్ధి పొందవలయును గదా? యని వాదింపవచ్చును. వృద్ధి పొందవలదని యెవ్వరు ననుటలేదు. అనేక క్రొత్తయంత్రములు విలసిల్లినవి. ఇదివరకు తెలియని విషయము లిప్పు డనేకములు క్రొత్తగా తెలిసినవి. అవి లేనప్పుడు వానికి పేర్లు లేవు. అవి యున్నప్పుడు వానికి పేర్లుండియే తీరవలయును. ఆ పేరులు గ్రహించుట బాషను వృద్ధి పరచుటయే యగును. కాని ఉన్న శబ్దములను ముక్కు మొగము చెక్కి వికృతపరచి వాడుట భాషను హత్య చేయుటయే యగును గాని వృద్ధిపరచుట కాజాలదు. తెలుగు పత్రికలు శబ్దము సంకను దాని సరియైన యర్థములో వాడుట నేర్చుకోవలసి యున్నది. ప్రాథమికములైన శబ్దదోషములు పరిహరించి వ్రాయుట నేర్చుకోవలసి యున్నది. తెలుగువాక్యము నెట్లు నిర్మించవలయునో నేర్చుకోవలసియున్నది. విశేషణ విశేష్యములకు భేదమేమిటో నేర్చుకొనవలసి యున్నది.

తెలుగు పత్రికా లోకమునందు లోపించిన మరొక గుణము సహనము. అభిప్రాయభేదము లుండుట సహజము. ఆ యభిప్రాయభేదము తమకు వ్యతిరేకముగా ప్రకటింపబడినపుడు పత్రిక లోర్చుకొనవు. కొన్ని యేండ్లకు ముందు రేడియో వారేర్పరచిన ఒక సమ్మేళనములో కొందరు పత్రికల భాషను విమర్శించిరి. ఆ విమర్శ నిజమా కాదా యను విచారించు ఓర్పు పత్రికలకు లేకపోయినది. తమవరకు రానంతవరకు పత్రికలు వాక్స్వాతంత్ర్యమునకు ప్రాతినిధ్యము వహించుచుండును. కాని తమకు వ్యతిరేకముగా నింకెవ్వరు మాటాడకూడదని వారి యభిప్రాయము. తామితరులకు వ్యతిరేకముగా వాడుచున్న యధికారమునకు తమకు వ్యతిరేకముగా ఇంకొకరేలవాడకూడదు. వాడవచ్చునన్న సిద్ధాంతమును వారంగీకరింతురు. నిజముగా మరొకడు వాడినప్పుడు వానిని దుయ్య బట్టుదురు, వానికి వ్యతిరేకముగా ప్రచారము చేయుదురు. వాడుచేసిన ఆక్షేపణకు మాత్రము సమాధానము చెప్పరు.

పత్రికలలో జరుగు వాద ప్రతి వాదములు కూడ చిత్రచిత్రములుగా నుండును. నిరంతర ప్రచారముచేత కొందరొకనిని మహాకవిగా నిలబెట్టుదురు. అది కవిత్వముకాదను వారు మరికొందరుందురు. వారతడు కవికాదని వ్రాయుదురు. ఎదుటివారు సమాధానములు వ్రాయుదురు. సమాధానములు వ్రాయుట బాగుగనేయున్నది. కాని ఆ వ్రాయబడిన సమాధానములు సరియైన మార్గమును బట్టకపోవుట శోచనీయము. ఆ చెప్పబడిన దోషములు దోషములు కావని నిరూపింపవచ్చును. మరికొన్ని గుణములు చూపింప వచ్చును. కాని వారట్లు చేయరు. ఆయన వానికి గురుప్రాయులైన వారిని బట్టుకొని వారి కవిత్వములో తాము దోషములనుకొన్నవి చూపింప మొదలు పెట్టుదురు. లేక ఈ కవిత్వములో ఏవేవి దోషములుగా చెప్పబడినవో ఆయా దోషములు ఆ కవిత్వములో చూపింతురు. ఆ రెండింటికి నిజముగా సామ్యమే యున్నచో ఆ యిరువురు చేసినది దోషమేయగును కాని ఒకడు చేసిన దోషమును బట్టి ఇంకొకడు చేసినదోషము గుణముగా మారదు. రచయితలమాట యెట్లున్నను పత్రికల యెడ నిది బాధ్యతారాహిత్యమైన ప్రవర్తన యని చెప్పక తప్పదు.

కొందరు పత్రికలవారు సంస్కృతభాషకు వ్యతిరేకులు. కొన్నియేండ్లక్రింద ఒక దినపత్రిక అదేపనిగా సంస్కృతమునకు వ్యతిరేకముగా సంపాదకీయములు వ్రాసినది. తెలుగే భాషలోనుండి పుట్టినదన్న వాదమేమైనను కొన్నివందల సంవత్సరములుగా తెలుగు సంస్కృత భాషలపొత్తు విడదీయరానిదిగా నున్నది. సంస్కృతమును విడిచిన తెలుగు భాష లేదు. సంస్కృతమునకు వ్యతిరేకతయనగా తెలుగునకు వ్యతిరేకతయని యర్థము. భారతదేశమునకే వ్యతిరేకత యని చెప్పవలసివచ్చును. దేశీయమయిన సర్వ నాగరకతకు వ్యతిరేకతయని చెప్పవచ్చును. ఈ వ్యతిరేకతకు మూలము సంస్కృతము మృతభాషయన్న భావము కావచ్చును. ఎవడో యొకడు మృతభాషయని దానినన్నాడు. అందరును తలలూపుచున్న వారే కాని దాని కర్థము విచారించిన వారు లేరు. నేటికిని నిత్యవ్యవహారములో వాడబడుచున్న భాష సగము కన్న నెక్కువ సంస్కృతములో కూడుకొని యున్నది. పారిభాషిక పదములు నూటికి నూరుపాళ్ళు సంస్కృత పదములు, దేశీయమైన సర్వశాస్త్రములు సంస్కృతములో పఠించుచున్నాము. 'అహంగచ్ఛామి' 'భోజనం కురు' 'జలంపిబ' అని రోజువారీ సంభాషణలో దానిని వాడుటలేదు కాబట్టి అది మృతభాషయని దాని ప్రయోజనము తీరినదని మాటాడువాని బుద్ధి విశ్లేషమైనదని యర్థము. భాషయనగా నేమోదానిని గురించి వారు భావించలేదని యర్థము. కేవలనా గ్రూపములోనుండి అధిక విషయములు చెప్పుటకు వీలులేని భాషలెన్నో యున్నవి. వానిని మనము భాషలుగా వ్యవహరించుటలేదు. వాని యునికిని లెక్కగైకొనుటలేదు. పోవుచున్నాను, తినుచున్నాను, నడచుచున్నాను మొదలైన సామాన్య విషయములు వదలి అధిక విషయములను చెప్పవలసివచ్చినపుడెల్ల తెలుగునకు సంస్కృతమునే యాశ్రయింపవలసి వచ్చుచున్నది. ఇది ప్రత్యక్షమైన విషయము. తెలుగు భారత భాగవతములు సంస్కృత భూయిష్టములే కదా! అవి యర్థమైనంత తేలికగా అచ్చ తెలుగు కావ్యగ్రంథములు కావు. వానికి ప్రసిద్ధిరాలేదు. ప్రసిద్ధిరాకూడదని వానికి ప్రసిద్ధి తెచ్చిపెట్టుటకు, రావలసినవానికి రాకుండజేయుటకు నాడు పత్రికలు లేవుకదా! వానికి ప్రసిద్ధిరాకుండుటకు కారణమవి అచ్చ తెలుగు కావ్యములగుటయే. సంస్కృతభాషా ప్రయోజనము తీరినదని వాదించుట ప్రత్యక్షమునుకూడ నిరాకరించుట వంటిది. సంస్కృత ద్వేషము దేశద్రోహము వంటిది. భారత దేశము యొక్క ఐక్యమును చెడగొట్టుట కింతకంటె దుష్టమైన నినాదమింకొకటియుండబోదు.

అట్లని సంస్కృతపద్ధతిలో తెలుగు వ్రాయవలెనని కాదు. ఆ యుభయ భాషలసంప్రదాయములు భిన్నమైన తావులున్నవి. తెలుగు సంస్కృతమునకు బానిసమైనదని కొందరు వాదింతురు. వారి సంప్రదాయముల భిన్నత్వమెరుగరు. ఎరిగినవారు సంస్కృతమును ద్వేషించరు. ఎందుకనగా వారికి తెలుగుభాషా స్వాతంత్ర్యము తెలియును. సంస్కృత వ్యతిరేకతలో తెలుగుభాషా స్వరూప స్వాతంత్ర్యములు తెలియకపోవుట యున్నది.

పత్రికలలో సాహిత్యమును గూర్చి విమర్శించువారు మరొక వ్యాధికి బాల్పడినారు. ఆ వ్యాధి ఇంగ్లీషు కొలతబద్దలతో తెలుగు సాహిత్యమును కొలుచుట. తెలుగు కొలత

బద్దలతో ఇంగ్లీషు సాహిత్యమును కొలుచుట యెంత మూర్ఖత్వమో ఇంగ్లీషు కొలతబద్దలతో తెలుగు సాహిత్యమును కొలుచుట యంతే మూర్ఖత్వము. మన పత్రికా రచయితలకు ఫలానా ఇంగ్లీషువాడు సాహిత్యమును గురించి అన్నమాట ఎంతముఖ్యమో ధ్వన్యాలోకకర్తయో, రసగంగాధరకర్తయో యన్నమాట అంత ముఖ్యముగా గోచరించుటలేదు. వారు ఆమాట నోటితో చెప్పకకాని వారి సర్వప్రవర్తనలో తెలుగుభాష ఇంగ్లీషుభాష యంత శక్తిమంత మైనదికాదని స్ఫురించుచునేయుండును. ఇది విచార్యము, సాహిత్యదృష్టితో చూచినప్పుడు ఏ భాషకు వ్యంజనాశక్తి యధికమో అది యధికశక్తిమంతమని యర్థము. ఆ వ్యంజనాశక్తి సంస్కృత భాషకు ఇంగ్లీషుభాషకన్న నెన్నో రెట్లధికము. ఎందుకనగా వ్యంజన పద బాహుళ్యము నాశ్రయించి యుండును. పద బాహుళ్యము ఇంగ్లీషులోకన్న సంస్కృతములో నధికము. ఒక్కొక్క శబ్దమున కనేకార్థములుండును. ఒక యర్థమును సూచించు శబ్దము లనేకము లుండును. ఈ రెండింటియందును సంస్కృత భాషాధిక్యము నిర్వివాదము. సంస్కృతభాష పర్యాయపదము లధికముగా గలిగినభాష. మరల ఆ పర్యాయపదము లన్నింటికిని వ్యుత్పత్త్యర్థములు విచారించినపుడు భేదములు గోచరించును. అందుచేత సర్వస్థానముల యందొక యర్థమును బోధించుటకొకేశబ్దమును వాడవలసిన యవసరము లేదు. ఆ స్థానమునందు విశేషార్థమును సూచించుటకింకొక శబ్దమును వాడవచ్చును. లేశమాత్రమైన యర్థమూటు నిటుగాకుండ శబ్దము లుపయోగించుటకు సంస్కృత భాషలోనే వీలున్నది. మేఘమున్నది. అది జలమును ధరించును. అందుచేత దానిని జలధరమన్నాము! అది గర్జించును. అందుచేత స్తనయిత్ను వనబడును. అది తాపమును శమింపజేయును. అందుచేత ఘన మనబడినది. అది రైతును సంతోషింపజేయును. అందుచేత ముదిర మనబడినది. ఇట్లే యనేక శబ్దములును అట్టి సంస్కృతమును జీర్ణించుకొనిన తెలుగుభాష ఇంగ్లీషుకంటె తక్కువ శక్తికలది యనుకొనుట విచారిత రమణీయముకాదు. ఇంగ్లీషునీ దేశములోనుండి తొలగింప వలయునను ప్రయత్నమునకు కొంద రడ్డుపడుటకు తమ తమ భాషలపై వారికున్న యవిశ్వాసమే కారణము. దేశపురోభివృద్ధికి నాశించి ఈ యవిశ్వాసమును తొలగించుటకై పత్రికలు ప్రయత్నించి యుండవలసినది కాని వారా పనిచేయుట లేదు.

మొదట మనవిచేసినాను. సిద్ధాంతమునందలి యభినివేశమునుబట్టి పత్రికకొక వ్యక్తిత్వమేర్పడునని. ఒక సిద్ధాంతమునకు కట్టుబడి యుండుట మిక్కిలి కష్టముతో గూడుకొనిన కార్యము. కాని ఎన్నికష్టములకైన ఓర్చి తాము సిద్ధాంతమునకు కట్టుబడినవారికే ప్రత్యేకత, వ్యక్తిత్వము నేర్పడును. అన్యులకది యేర్పడదు. వారు ఎన్నో సంవత్సరములు నిర్విరామముగా పత్రిక నడుపవచ్చును. పత్రిక నడిపిచేసినదేమి యన్నప్రశ్నకు వారివద్ద సమాధానముండదను కొందును. దానిమీద కొంతలాభము గడించి యుండవచ్చును. కొంత ధనము పాడుచేసి యుండవచ్చును. కొంతమంది అనాథులైన రచయితలకు పేరు సంపాదించి పెట్టియుండవచ్చును. ఒక కవితామార్గమును నిలబెట్టినవారో ఒక విమర్శ పద్ధతికి రాచబాటలు వేసినవారో వారుకారు. అందుచేతనే చెప్పుట. వారు విశిష్ట వ్యక్తిత్వ

భూషితులు కాజాలరని.

ఇంతగా పేరుకొని పోయిన కశ్మలమును ఒకడు రెండు పత్రికలు దూరము చేయజాలవు. ఈ కశ్మలమును వేలుపెట్టి చూపించుటచేత వారు కష్టములు పడవలసివచ్చును. మరియు నెంతప్రయత్నమైనను సఫలమగుటకు కొంతకాలము పట్టును. నే నిప్పుడు చెప్పిన విషయములన్నియు నిర్వివాదములని మీ రంగీకరించ వలసినదని నే నభ్యర్థించుట లేదు. నా బుద్ధికి తోచినవిషయములు నేను కొన్ని చెప్పినాను. వానినిగురించి మీరాలోచింప వలసినదనియే ప్రార్థన. మీరు నా మార్గము నవలంబింపవచ్చును. అవలంబింపక పోవచ్చును. ఏ మార్గము నవలంబించినను దానిని గురించిన సూక్ష్మవిచారణ సలిపిన తరువాతనే యవలంబింప వలయునని నా కోరిక.

# అవిముక్తము

యస్వీ జోగారావు

ఎవరీ అద్దమరేయి నెక్కటిగనీ యేకాంత నిశ్శబ్ద నీ
రవ నైరాశ్యనిశావిశంకట కుటీర ప్రాంగణ ప్రాంత మం
దవలీలన్ జొర జూచువా రవుర యేమా దుర్నిరీక్ష్యప్రభా
వవిభాతావహ దివ్యదీధితి! వహావ్వా నీ వటోయీ ప్రభూ!

మొగిలు మొవ్వులనుండి రివ్వున దుసికిలి
జారివచ్చిన చిరుగాలి జాలువోలె
గాలిగోవాళ్ళ గడుసరి యేలపాట
కల్లనల వచ్చు జడి వన్నెలాడి వోలె

వచ్చితివా ప్రభూ! పరమ భాగవత ప్రథితాంతరంగ పా
టచ్చరమైన నెన్నడ యెడాటముతో నిటు లీ కుటీరమున్
జొచ్చితివా ప్రభూ! కలయజూచితివా యిటనేమి యున్నదో!
వచ్చిన దారి నేగు మిక భక్తిని బత్తెముగా నొసంగెదన్.

దేవా యేమని యాన తిచ్చితివి? ఏదీ యేది యా మాట మ
ళ్ళీవా కొమ్మది యేదో మోక్షమును నా కీవచ్చినా నందువా!
భావస్నిగ్ధము భక్తిముగ్ధమును మత్స్వాంతమ్ము; నే నందువా
జీవన్ముక్తుడ నొందు చోటికిని వేంచేయంగ నూహింపుమా!

స్వామి! మోక్షమనగ నేమి? నీ లోన నా
యంతవాడూరక యైక్య మగుట
పోనిమ్ము లీనమై పోదునా యన్న నా
వలె మరి నిన్ను గొల్చువా డెవండు?
నీకు లోకములో ననేకు లుందురు గాక
భక్తులు; నా వంటివాడు లేడు
కాదు కా దిది యహంకారమ్ము; నా వెర్రి
బాగుల మమకార ఫక్కి యింత

ఏను కోరని మోక్షము నిత్తు ననుచు
కోరి నష్టమునకు నేల గురి యగుదువు?
ఈవు లేక నే నుండ లే నేను లేక
ఎట్టు లుందువు నీవు నా చిట్టి తండ్రి!

# సాహిత్యధార

అమాయకుడైన ఒక పెద్దమనిషి అడిగాడు 'మహాకవి ఎవరిదైనా ఇంటిపేరా ఏమిటి నాయనా' అని. ఆయన మళ్ళీ అన్నాడూ "ఏదో పుస్తకంలో చూచానులే నాయనా! 'మహాకవి చదువులగది' 'మహాకవి పడకగది' 'చేశారు మహాకవి' 'వ్రాశారు మహాకవి' అని వ్రాసివున్నది. ఈ కాలంలో మీరంతా కవులను వారి అసలు పేర్లతో కాక ఇంటిపేర్లతో పిలుస్తున్నారు కదా! ఘోరకవి అని ఇంటిపేరుగల వాళ్లు లేరూ! అల్లాగే ఇదీ ఇంటిపేరేమో అనుకున్నాను. మొదట ఘోరకవి అనేమాటే అచ్చుతప్పుపడి మహాకవి ఐందేమో అనుకున్నాను. కాని మాటిమాటికీ అదేమాట వస్తే అచ్చుతప్పని ఎల్లా అనుకోను" అన్నాడు. నాకు నవ్వువచ్చింది. నేను నవ్వాను. ఆయనకు కోపం వచ్చింది. 'కాదండీ! గురజాడ అప్పారావుగారని ఉన్నారు. వారి పేరుకు బదులు ఈ శబ్దం వాడుతున్నారు. మీకు తెలుసేమో అనుకున్నాను' అన్నాను. ఆ పెద్దమనిషి అంత తేలికగా వదిలేట్టు కనబడలేదు. 'ఆయన ఏం వ్రాశాడూ' అని దీర్ఘం తీశాడు. నేను దేశభక్తి గేయం చదివి — కాదు పాడి — వినిపించాను. 'దేశమంటే మట్టికాదోయ్ దేశమంటే మనుషులోయ్' దగ్గర గొంతెత్తి అరచాను. పాటంతా అయిపోయిన తరువాత దేశమంటే మట్టికాదోయ్... మనుషులోయ్. అని మళ్ళీ అరచాను. ఆ పెద్దమనిషి అమాంతంగా ఎగిరి గంతేస్తాడేమో అనుకున్నాను. కాని ఆయన అల్లాంటిదేమీ చేయలేదు. పైగా నవ్వటం మొదలుపెట్టాడు. ఈసారి కోపం వచ్చింది నాకు. వచ్చింది అని చెప్పటానికి వీలులేదు కాని, రాలేదు అని చెప్పటానికి కూడా వీలు లేదు.

కోపంవచ్చి ఏంచేయాలి? 'క్రీస్తుపూర్వం మనుష్యులు' 'పాతరాతియుగం మనుష్యులు' 'మూడుకాళ్ళ కుందేళ్ళ హక్కుదారులు' 'పెట్టుబడిదారీ విధానానికి పెట్టని కోటలు' మొదలైన పరిభాష వాడాలి. ఎక్కడనుంచి వచ్చిందోకాని, ఎన్ని దేశదేశాలు లంఘించి వచ్చిందోకాని ఈ శబ్దాలకు ఎదుటివాణ్ని భయపెట్టించే శక్తి అమితంగా వచ్చింది. తలారివాళ్ళ (తలారి అంటే తలకు శత్రువు. తల + అరి. కావంటే మీరు క్రీస్తుపూర్వపు మనుష్యులు) కత్తికి దయచేసినట్లు వీడిమీదకు వెళ్ళవచ్చు వీడిమీదకు వెళ్ళరాదనే విచక్షణ ఈ శబ్దాలకు లేదు.

ప్రశ్నకు మాత్రం సమాధానంరాదు. లేదేమో! అందుచేతనే ఈ తలారివాళ్ళు అంటే తలకాయకు శత్రువులు ఈ కత్తులను ప్రయోగిస్తున్నారేమో! ఎంతవాడి కత్తులైనా ఎన్నాళ్ళు మొండిపడి పోకుండా ఉంటవి. పాతరాతియుగం మనుష్యులని శ్రీశ్రీ గారంటే సుప్రసన్న ఆయనమీద విసుగుబడి అన్నాడూ 'మీరు మురికి కాలువల యుగం మనుష్యులు' అని. సమాధానాలూ, ప్రతి సమాధానాలూ ఇట్లా ఉంటున్నవి.

సరేకానీ మంచీచెడూ, నిజమూ అబద్ధమూ వీటిని నిర్ణయించటానికీ క్రీస్తెవడు? జ్ఞానోదయం లోకంలో క్రీస్తుతో ప్రారంభమైందా? క్రీస్తుపూర్వం పైకిపోయిన కొద్దీ లోకం మూఢమై క్రిందికి దిగివచ్చిన కొద్దీ లోకం జ్ఞానవంత

మైందా. మూఢవిశ్వాసాలంటారే అవి కల వాళ్ళు అన్ని మతాలలోనూ ఉంటారు. క్రీస్తు పూర్వం జగత్తంతా అంధకార బంధురమైంది అనుకోవటం అదొక మూఢవిశ్వాసం ఎందుకు కాదు? ఇటువంటి ఊహాలకి కాలదోషం పడుతుంది. పట్టింది.

కొన్నిమాటలు ఎవ్వరూ ఎప్పుడూ అని ఉండరు. వాళ్ళామాటలు అన్నారని కొందరు తమలో తాము అనుకుంటారు. అనుకొని వాటికి సమాధానాలివ్వటం మొదలు పెట్టు తారు. సమకాలిక జీవితాన్ని కావ్యంలో ప్రతి బింబించవద్దని ఎవ్వరూ అనలేదు. వ్రాయి నాయనా వ్రాయి. వ్రాసేదేదో సవ్యంగా వ్రాయమన్నారు తప్ప ఫలానిది వ్రాయకు అని ఎవ్వరూ అనలేదు. అసలింతకూ ఎవ రెట్లా అన్నారని వీళ్ళు ప్రచారం చేస్తున్నారో వాళ్ళల్లో ఎవ్వరూ అనలేదు. కాలికి పుండు పుట్టింపయ్యా అంటే మూతికి పంచదారా స్తారేమి? అట్లా అన్నవారు లేక పోగా సమ కాలికమైంది వ్రాస్తేనే కవిత్వం 'రామాయ ణం దెబ్బపదకొండోసారి' వ్రాస్తే అది కవి త్వం కానేకాదు. అన్నవాళ్ళు మాత్రం ఉన్నారు. చుట్టూ గిరిగీసుకొన్నది మనం. చెప్పేటప్పుడుమాత్రం ఇతరులు గీసుకున్నా రని చెప్పటం. అచ్చంగా కవిత్వంలో వాడు ఈకాలాల గోడలల్లో ఎందుకు పడతాడు. "పుష్పలావికలతో పూల చెండ్లాడుకున్న ప్రబంధకవుల" ను వాడు నిరసించడు, "నాటి ప్రజల ఉద్యమం" అని 'మేగ్నకార్టా' ప్రక టించి సర్వదా రాజుల చంకలోనే ఇరికి ఉన్న వాణ్ణిహర్షించడు. అర్థమున్నది. ముఖమున్నది. కావ్యమున్నది. మనమున్నాము. మిగిలిన దెందుకు? ఎందుకూ అంటే ఎందుకోకాని అవే కొందరికి ప్రధానమైనట్టున్నాయి.

సంగీత సభలో వీరు చక్కగా గాయకుని సంగీతం విని సంతోషిస్తారు. వీడు సంఘ సం స్కర్త. వీడు క్రీస్తుపూర్వం మనిషి. ఈభేదాల క్కడలేవు. ఎటువచ్చీ సాహిత్యంలోనే ఇవన్నీ పుట్టాయి. ఎందుచేతనంటే కొంతమంది అలం కార శాస్త్రాదుల్లో లేనివి ఉన్నట్లుగా చెప్పి అపోహాలు కల్పించారు. కావ్య విమర్శను అపమార్గం పట్టించారు. పూర్వమార్గంలో ఉన్నవాళ్ళు కొత్తదనానికి వ్యతిరేకులని ప్రచారం లేవదీశారు.

అందుచేత అయ్యా! దేనిని విమర్శించు తారో దాన్నిగురించిన ప్రత్యక్షజ్ఞానం కలిగి మరీ విమర్శించండి. చెప్పుడుమాటలు విని, అవికూడా పరోక్షజ్ఞానం కలవాళ్ళ చెప్పులకు లొంగి (చెప్పు అంటే మాట నా చెప్పుసేయు అని కుమారసంభవము) విమర్శలు చేయడం అనర్థదాయకం.

ఒకరు వ్రాస్తూ అన్నారుకదా 'కొలను గట్టున కోనెలలోపల కలసెను బంగరు దుగ్గిమ్మా' అనేచోట ప్రబంధకవి ఐతే యీ అదను చూచుకొని కనీసం అరడజను సీస పద్యాలతో మన దుంప తెంచేవాడు' అని. మన దుంప అంత సన్ననిదైతే పాపం! వాడేం చేస్తాడు? వాడు తెంపవలసిన అక్కర లేదు. అదెప్పటికీ తెగేఉంటుంది. వాడు వర్ణించాలంటే అది ప్రబంధం కాబట్టి వాడు వర్ణి స్తాడు. అంటే వాడికి ప్రబంధమంటే ఏమిటో తెలుసు మనకు తెలియదని అర్థం. ప్రబంధా నికీ పుత్తడిబొమ్మ పూర్ణమ్మ గేయానికి పోలిక ఎట్లా కుదురుతుంది? ఇది కథానిక కాబట్టి మూడు పుటల్లో ముగించాడు. నవల అయితే మూడువందల పుటలు వ్రాసి మన దుంపతెంచే వాడంటే దోషం మన దుంపదా? అది వ్రాసినవాడిదా? అసలు ఆ పూర్ణమ్మ

కథమాత్రం ఇరువది నాలుగు పద్యాల్లో ఎందుకు వ్రాయాలి? పూర్ణమ్మ అనే పిల్లను ముసలివాడికిస్తే ఆమె చచ్చిపోయింది. అది వ్రాయవచ్చుగదా? ఎందుకు వ్రాయలేదు? మేలతెల్లాలా! తల్లుల్లారా! పిల్లల్లారా! అని ఎందుకా విలాపం? అంటే కేవల కథారచన కంటె అధికమైన ప్రయోజనం ఏదో ఒకటి ఉండాలికదా? అది చిన్న గేయాలు వ్రాసే వాడికే ఉంటుంది కాని పెద్దకావ్యాలు వ్రాసే వాడికి ఉండదా? ఉంటే ప్రధానమైన ప్రశ్న ఏమంటే ఒక కావ్యమో, గేయమో, ఖండికయో, ఏ ప్రయోజనాన్నుద్దేశించి వ్రాయబడ్డవి? ఆ ప్రయోజనం ఎంతవరకు సాధించబడ్డది? ఇది కవితారీతులకు సంబంధించిన ప్రశ్న. ప్రధాన విషయానికి సంబంధించిన అల్పతాధికలు కూడా ఉన్నవి అవివేరు.

ఒక పెద్దకథ. ఒక చిన్నకథ. ఈ రెంటికీ భేదం లేదా? చిన్నకథ ఒకేఒక భావానికో లేక ఒక అభిప్రాయానికో వ్యాఖ్యానం చేయగలుగుతుంది. బహుభావాలకు లేక వాని యొక్క భిన్నాంగాలకు వ్యాఖ్యానం చేయగలుగుతుంది పెద్దకథ. ఈ రెండింటి రచనలో సాఫల్యం కలిగినవాళ్ళనే ఆ యా రంగాలలో గొప్పవాళ్ళనటానికి వీలుంది. మళ్ళీ బృహత్కథారచనలో సఫలులైనవాని ప్రక్కన లఘుకథారచనలో సఫలులైనవాణ్ణి కూచోపెట్టటానికి వీలుందా? ఓ హెన్రీని విక్టర్ హ్యూగో ప్రక్కన కూచోపెట్టవచ్చా? కవి చౌడప్పను తిక్కనగారి పక్కన కూచోపెట్ట వచ్చా? వచ్చు అనే వాళ్ళుంటారనుకోండి. వాళ్ళవివేకం వాళ్ళది.

భవిష్యత్కాలంలో కూడా నిలబడగలిగిన శక్తి కవిత్వానికి ఉండాలని అందరూ ఒప్పుకుంటున్నారు గదా! ఒప్పుకుంటే ఆశక్తి దేనిమీద ఆధారపడి ఉన్నది? కావ్యంలో ప్రతిబింబితమైన సాంఘిక సమస్యమీద ఆధారపడి ఉన్నదా? లేక కవియొక్క రచనాశక్తిమీద ఆధారపడి ఉన్నదా? అభ్యుదయ కవులందరి కావ్యవస్తువూ దాదాపు ఒకటే కదా? వాళ్ళ సాంఘికాభిప్రాయాలూ ఒకటే కదా? మరి వాళ్ళందరిలో శ్రీశ్రీకే ఆ ప్రత్యేకత ఎందుకు? ఎందుకంటే వీళ్ళందరిలో ముఖ్యమైన విషయం ఏదో ఆయనలో ఉందన్నమాట. ఇదిగో! సర్వకవిత్వానికీ మూలం ఆశక్తి. ఆ శక్తినిబట్టి హెచ్చుతగ్గుల లెక్కవేయండి. సంఘ సంస్కరణాభిలాషా, మేగ్నకార్టా వగైరా వగైరాలను బట్టికాదు. తన కాలం ముద్రలేని కవి అంటూ ఉండడు. ఎటువచ్చీ మన యిష్టం వచ్చినవాళ్ల దగ్గరికి వచ్చేటప్పటికీ అది ఉన్నదని ఒప్పుకొంటాము. ఇతరుల దగ్గరికి పోయినప్పుడు ఉన్నదని ఒప్పుకోము. మన మొప్పుకొనకపోయినా అది ఉండనే ఉన్నది.

ఏమన్నా అంటే 'గురజాడని తెలుగు ప్రజలంతా ఏనాడో గొప్ప మహాకవిగా అంగీకరించారు' మధ్య నువ్వెవరివి? అంటారు. అంగీకరించటానికి నువ్వెవడవో అంగీకరించక పోవడానికి వాడూ వాడే. అప్పారావుగారిని ఆ కవి అనేవాళ్ళు కనబడుతున్నారు. విశ్వనాథ వారినీ అనేవాళ్లు కనబడుతున్నారు. ఆయననూ ఈయననూకూడా మహాకవులనేవాళ్ళు కనబడుతున్నారు. వాళ్ళూ ప్రజలే. వీళ్ళూ ప్రజలే. ఇక సంఖ్యాబలం ప్రశ్న వస్తుంది. పోల్ చేయించటానికి వీలులేదు. ఇంక పత్రికలు శరణ్యంగా కనిపిస్తున్నవి. అవి అధ్వాన్నంగా ఏడుస్తున్నవి. ముఠాలమీద నడుస్తోంది వ్యవహారం. నీదీ ఒక ముఠాయే అంటారూ. అంతే.

అభ్యుదయ సంఘం వాళ్ళకు ఆ సంఘం వాళ్లు ప్రజలు. పూర్వ సంప్రదాయం కావాలనే వాళ్లకు పిలకజుట్లవాళ్లు ప్రజలు. సమర్థులెప్పుడూ స్వశక్తిమీద ఆధారపడి పైకి వస్తారు. అసమర్థులెప్పుడూ సంఘాల నాశ్రయించి పేరు సంపాదిస్తారు. సాహిత్యంలో సంఘాలు పెట్టేది వీళ్లే.

సరే. ప్రజలు అంగీకరించారనే అందాం మాకు కాంగ్రెస్ ప్రభుత్వమే కావాలని ప్రజలు ఒక్కసారికాదు, రెండుసార్లన్నారు కదా! రెండవసారి మరీ గట్టిగా అన్నారు కదా! మరి మనం ఒప్పుకోవటం లేదేమిటి? సాహిత్యం దగ్గర ప్రజలూ రాజకీయాల దగ్గర మనుషులూనా? ఆ ప్రభుత్వానికి వ్యతిరేకులైన ప్రజలూ ఉన్నారు మేమందులోని వాళ్ళం అనటం సహజం. ఆమాట కవుల విషయంలో అనటానికి వీల్లేదా? అన్న వాదన మనమో నాలుగు రాజకీయపు తిట్లుతిడితే వ్యవహారం ముగిసిందా? అందుచేత మహానుభావులారా! ప్రజలు అంగీకరించారని డబాయించే ప్రయత్నంచేయవద్దు. కాంగ్రెసు వారు తమ ఎన్నికలగుర్తుల నుపయోగించినట్టుగా కొందరి నుపయోగించి వాళ్ళను మహాకవులుగా నిలబెట్టే ప్రయత్నమూ చేయవద్దు. ఈ మాటలు మరొకరిని మహాకవి అనేవాళ్లె విషయంలో కూడ మీరు ప్రయోగించటానికి వీలుందని తెలుసు. అందుకనే ఆలోచనచేత నిర్ణయింపవలసిన ఈ విషయాన్ని సాంఘికాదిభావాలచేత నిర్ణయించవద్దని అనటం.

వీరికథ 'పరస్పరం ప్రశంసంతి అహో రూపం అహోధ్వనిః' అన్నట్లుగా ఉంది.

అయితే మీరు విన్నారోలేదో కాని, ఒక వర్ధంతి సభలో ఒక ప్రసిద్ధకవి "గణ యతి ప్రాసలు" ద్వంద్వ సమాసం కాదని అన్నారు. గణ యతి ప్రాసల్లో మూడు పదాలున్నవి కదా? ఇది ద్వంద్వ మెట్లా అవుతుందని వారి ఊహయేమో! ఆ లెక్కన సీతారామ లక్ష్మణులు త్రయ సమాసము. రామలక్ష్మణ భరత శత్రుఘ్నులు చతుష్టయ సమాసము. యుధిష్ఠిరభీమార్జున నకుల సహదేవులు పాంచజన సమాసము.

ఈ బాకాల, డోళ్ళ, సన్నాయి మేళాల గోలలో ఒక వైపు బేజారెత్తిపోతుంటే ఇంకో వైపునుంచి 'సంస్కృత భాషయొక్క ప్రయోజనం తీరింది' అని మరోధ్వని.

ఇంతకూ వారిమాట ఒక భావోద్రేకం'లో అన్నారని అందాం? ఎందుకంటే భావోద్రేకం కలిగిన స్థితిలో కవి "వలవల యేడ్చును. పకపక నవ్వును. పిచ్చికేకలిడును" అని ఏకాంత సేవ పీఠిక ఇది అట్లాంటిదే అనుకోండి. అనుకొని మీరు నవ్వవచ్చు. 'నవ్వుకొందురు గాక నా కేటి సిగ్గు' ఈ మాట కవిత్వంలో అందం జీవితంలో లేదు. ఇదే వ్యవస్థ లేదనటం. మేము సుస్థు అంటేవారు కుష్ఠువ్యవస్థ అన్నారట.

ఎప్పుడూ రాజధానిని పట్టుకొని వేలాడే వాళ్లు కొందరుంటారు. వారి అభిప్రాయాలు ప్రొద్దుతిరుగుడు పూవుల్లాగా ఎప్పుడూ దిశలు మారుస్తుంటవి. మా తాత తండ్రులు గొప్ప వారని వారు ఇవాళ్ళ నాస్తే 'పీడలాంటిభూతం మన తాతల్లి తండ్రుల్లో నాతి రోత రోత' అని చెప్పు వ్రాయటానికి వెనుదీయరు. ఈ తత్త్వం యొక్క స్వరూపం డొస్టొవస్కీ వ్రాసిన 'పొజెస్డు' అన్న గ్రంథంలో బాగా నిరూపితమైంది. అందుకనే డొస్టొవస్కీకి రష్యాలో పేరు లేదు. అనియంత్రమైన మనస్సులో పుట్టుతున్న ఈర్ష్యాద్వేషాది అసంఖ్యాక భావాలను ఆధారంగా చేసికొని ఎప్పుడేది అనుకుంటే

అప్పుడా భావాన్ని వెల్లడించవచ్చునా?

గొప్పకవులు ఇల్లా తప్పుదారులు తీస్తుంటే విశ్వవిద్యాలయాల్లోని ఆచార్య పీఠాలమీద ఉండే బాధ్యత కలవాళ్ళు మరియింకొక విధంగా తప్పుదారులు తీస్తున్నారు. అది ద్వంద్వ సమాసం కాదనటం ఎల్లాంటిదో ముక్తపద గ్రస్తాన్ని యమకం అని చెప్పటం అటువంటిది. హృషీకేశశబ్దం ఋషీకేశ అనటంఅంటువంటిది. మరి "నిండు మనంబు నవ్యనవనీత సమానము పల్కు దారుణాఖండల శస్త్రతుల్యము జగన్నుత! విప్రులయందు" అన్నచోట 'జగన్నుత' సంబోధన అని చెప్పవలె. 'జగన్నుత విప్రులు' అని సమాసంచేస్తే, బాధ్యతకల వాళ్ళుచేస్తే ఆచార్యులైనవాళ్లుచేస్తే పిల్లలగతి ఏంకావాలి? పైగావాళ్లు ఇన్ని డిగ్రీలున్నా ఏ పండితులవద్దనో చదువుకొంటూనే ఉన్నారుగదా! వారిదగ్గరకూడా ఇల్లాంటివి చదుపుకొని చెపితేమంచిదిగదా! వారులోకం మేలుకోసం చేయాలె. వీరు విద్యార్థుల మేలుకోసం చేయాలె. కోపాలు వచ్చినా బాధ్యతలు మాత్రం తొలగవు.

— సప్తర్షి.

# ఆకాశవాణి

ఆకాశవాణివారు బహుళంగా సంగీత నాటికలను ప్రసారం చేస్తున్నారు. సంగీతం వినబడినంతవరకు, నాటికాత్వం ఇరవైవంతులు. నాటిక బాగుండలేదంటే, సంగీతం ఎంత అందంగా కుదిరింది! అంటారు. సంగీత నాటికకు సాహిత్యపు విలువ ఏమీ అక్కర్లేదని ఆకాశవాణివారు నిర్ణయం చేసినట్టున్నారు. ప్రాణభూతమైన కథ దెబ్బతిన్న తరువాత సంగీతం ఎంతఉంటే ఏం? పై మెరుగులు ఎన్నిఉంటే ఏం? ఇది ఆలోచించరు ఆకాశవాణి నిర్వాహకులు. అందువల్లనే పందొమ్మిది వందల యాభైతొమ్మిది డిసెంబరు తొమ్మిదో తేదీన హైదరాబాదు కేంద్రం నుండి 'శర్మిష్ఠ' అనే 'సంగీత నాటిక' ప్రసారమైంది. రచన: దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు. సంగీతం: పాలగుమ్మి విశ్వనాథంగారు.

కొన్నాళ్ళకింద 'ఆండాళ్' అనే నాటిక సంగీతనాటిక – ఎల్లా సంప్రదాయ విరహితంగా ప్రసారితమయిందో ఈ శీర్షికకిందే మనవిచేశాను. ఈసారి శర్మిష్ఠ మూల విచ్ఛేదకంగా తయారయింది. తమ భావాన్ని వెల్లడి చేసుకోవటానికి ఎవరికీ అభ్యంతరం ఉండదు. అందుకోసం మూల గాథను హననం చేయడమెందుకు? ఏవో పాత్రల్ని కల్పించుకొని, ఏదో కథను సృష్టించుకోవచ్చుగదా! భారతంమీదికి దండెత్తడ మెందుకు? భారతంలో దేవయానిని పెళ్ళాడిన యయాతి, ఆమెకు పరిచారికా స్థాయిలో ఉన్న శర్మిష్ఠను పరిగ్రహించిన కారణంగా, మామగారైన శుక్రాచార్యులవారి శాపం అయిన ముసలితనం పొందుతాడు. శర్మిష్ఠ కుమారుడు తన యౌవనాన్ని తండ్రికిచ్చి, తండ్రి ముసలితనం తాను తీసుకొంటాడు. అతని త్యాగాన్నీ, పితృభక్తినీ అందరూ మెచ్చుకొంటారు. అక్కడ ఆ కథకి ప్రయోజనం ఉంది. ఈ 'శర్మిష్ట' ప్రయోజన విరహితంగా తయారయింది. ఈ నాటికలో యయాతికి ముదిమి రావడం లాంటి కొన్ని విషయాలు భారతం

నుండి గ్రహించి మిగతా అంతా రచయిత సమకూర్చారుట. ఆ కొన్ని విషయాలు మాత్రం గ్రహించడ మెందుకు? అక్కడికి భారతా న్నుద్ధరించినట్టు. గ్రహించినా, ఆ గ్రహింపబడ్డ విషయాలు మూలానికి విరుద్ధం కాకుండా కూర్చుకోవాలి. ఈ నాటికలో యయాతికి ముదిమి ఎలావచ్చిందో తెలియదు. శర్మిష్ఠను పరిగ్రహించడానికి ముందే ఈ నాటికలో వచ్చింది. శర్మిష్ఠా పరిగ్రహణం నాటికలో చిట్టచివరి విషయం. మూలంలో ముదిమి శాపంవల్ల వచ్చింది. ఆశాపానికి శర్మిష్ఠా పరిగ్రహణం కారణం. శర్మిష్ఠా పరిగ్రహణం లేకుండానే ఈనాటికలో ముసలితనం ఉన్నది కాబట్టి వయసా వచ్చిందేలయి ఉండాలి. వయసా వచ్చింది. వసంతోత్సవం వల్ల పోతుందని ఓ కవి చెప్తాడు. దాంతో వసంతోత్సవం ప్రారంభం. ఇక శర్మిష్ఠను గ్రహించాక యయాతికి ముదిమి రాదన్న మాట. అంటే భారతికథ మూలం కాకూడదు మరి. మన ఇష్టమొస్తే, మూలంఅయి, కాకపోతే కాసంతమాత్రానికి ఆ మూలం ఎందుకు? రవీంద్రుని 'ఫాల్గుణి' ఛాయలూ ఉన్నాయిట. ఈ కలగూరగంప ఎందుకు? అసలు నాటికే ముఖ్యతుకు. దీన్ని మూడు నాటికలుగా విడదీయవచ్చు. ఒకటి: దేవయాని. రెండు: శర్మిష్ఠ మూడు: వసంతోత్సవం. ఒకే నాటికగా, అవసరమైతే మూడు నాటికలుగా ప్రసారం చేయడానికి వీలైంది ఇది. అల్లా ప్రసారం చేయడానికి ఆకాశవాణి వారు సమర్థులుకూడా. పాటగాండ్రు చాలా ఉత్సాహవంతులు. పాడిన చరణమే పాడి, పాడి, శ్రోతను భోరెత్తించారు. సంగీతంకూడా మోతాదు హెచ్చితే అసంగత మవుతుందిగదా!

తమ 'చెల్లింపబడే కళాకారులు ( Paid Artists ) ఉన్నారు కాబట్టి వారితో తప్పని సరిగా పనిచేయించుకోవాలనే మనస్తత్వం తోనో, మరెందుచేతనో ఆకాశవాణివారు ఈ విధంగా చేస్తున్నా రనిపిస్తుంది. ఈ దృష్ట్యానే కావచ్చు. డిసెంబరు పధ్నాలుగో తేదీన మద్రాసు కేంద్రం జలసూత్రం రుక్మిణీనాథ శాస్త్రిగారి 'సయ్యాపైస' నాటిక ప్రసారం చేసింది. తనపెళ్ళికి సయ్యాపైసకూడా కట్నం తీసుకోనంటాడు నాటికా నాయకుడు. విషయం ఇంతే. సయ్యాపైస సయ్యాపైస అని నాటికలో పలసై సార్లురాగానే 'సయ్యాపైస నాటిక' తయారయింది. ఏ దృష్ట్యాకూడా బాగాలేదు. దీన్ని ప్రసారం చేయడం రేడియోవారి' బాధ్యత తీరినట్టు కావచ్చు. కాని, అటు ఆ కళాకారుడికి పేరూ, ఇటు శ్రోతకి కాలమూ నష్టం. అదే కళాకారుడి 'సింహం కొమ్ములు' అనే నాటిక ఇరవై మూడో డిసెంబరున అదే కేంద్రం ప్రసారం చేసింది. అది 'సంగీత నాటిక'. సంగీతంలో వీధి నాటకఫక్కీ అవలంబించి, కొంత కొత్తదనం తీసుకురావడానికి ప్రయత్నించారు. ఊహ సరికొత్తగాఉంది. కాని ఆ ఊహ మాత్రం నాటికలో సరిగా నిర్వహింపబడలేదు. అదికాలం తక్కువకావడంవల్ల లోపమో, ఊహ పెద్దదిగావడంవల్లనో మో తెలియదు. తమను తామే అనుకరించే స్వభావం గల కొందరు 'చెల్లింపబడే కళాకారులు' ఇక ఈ ఊహమాత్రం ఆధారంగా పంచతంత్రం కథలకి కుతంత్రం నాటికలు తయారు చేయవచ్చు. అవి అద్యతన భవిష్యత్తులో శ్రోతలు కూడా వినబోవుదురుగాక. ఈ మాటెందుకన్నానంటే, పదకొండో డిసెంబరున విజయవాడ నుండి ప్రసారమైన 'లత' గారి 'వంకర

గీతలు' అనే నాటిక అల్లాగేఉంది. గోరా శాస్త్రిగారి 'ఆనంద భవనం' అన్న రేడియో సీరియల్ నాటికకు అది చిన్నసైజు అనుకరణ ప్రతి ధ్వనికూడా. తమ గొంతే తాము ఆకాశ వాణివారు గుర్తించుకోలేనంత ఘోరం మరొకటి ఉండదు.

ఎంతచెప్పినా, నాటిక కాని దాన్ని నాటిక అనడం అలవాటైంది. ఆకాశవాణి వారికి. అందువల్ల హైదరాబాదునుండి భరద్వాజగారి నాటిక కాని కథ 'మొనలేని శిఖరం' ప్రసారం చేయబడింది. సమన్వయం లేకుంటే, జీవితంలో ఎన్ని సుఖాలున్నా లాభం లేదని కథ కుడి ఉద్బోధ. కథకుడి వాచికంతప్ప మరేఇతర వాచికమూ బాగా లేదు. డిసెంబరు ఇరువయ్యోన వింజమూరి శివరామారావుగారి 'జయదేవ భారతి' బాలమురళీకృష్ణగారి సంగీతంలో ప్రసారమైంది విజయవాడనుండి. కథ అవాస్తవికం. కల్పనలో, రచనలో విశిష్టతలేదు. కాకపోతే బాలమురళీకృష్ణ, శ్రీరంగం గోపాలరత్నం గార్లవల్ల నాల్గు అష్టపదులు హాయిగా శ్రోతలువిన్నారు. అంతే.

డిసెంబరు రెండున మద్రాసునుండి విద్వాన్ విశ్వంగారి 'యుద్ధం మాకొద్దు' అన్న నాటిక ప్రసారమైంది. అది ఆకాశవాణి వారికి జన్మకి శివరాత్రిలాంటి ప్రసారం. ప్రయోజనం దృష్ట్యా, రచనదృష్ట్యా, నిర్వహణదృష్ట్యా... చాలాబాగుంది. సంగీతం దాదాపు లేనట్టే. అయితేమాత్రమే? అది పూర్తిగాఉన్న వాటి కన్నా బాగుంది.యుద్ధంవల్లకల్గే భీభత్సం, శాంతి యొక్క అవసరం, దాని రాకలోని తప్పనిసరి తనంలాగా వ్యక్తీకరింపబడ్డాయి. కంఠధారలు చక్కగా నిర్వహించారు. అందులోనూ దాన వుడి కంఠం చాలా ప్రాభావికంగా (Effective) కుదిరింది... డిసెంబరు పద హారున విజయవాడ నుంచి ప్రసారమైన న్యాయపతి రాజగోపాలంగారి 'భగ్న మకుటం' అన్న చారిత్రాత్మక నాటికకూడా బాగుంది. అది చారిత్రాత్మకంగా రాణించింది. అయితే వాచికం దగ్గర లోపం జరిగింది. పాత్రలు విదేశీయాలయినంత మాత్రాన, తెలుగులో మాట్లాడుతూ ఉచ్చారణను భ్రష్టంచేయవలసిన అవసరమేమీ లేదు. దీనిలో అల్లాంటి ప్రయత్నం విరివిగా సాగింది. నిర్వాహకులు ముఖ్యంగా గమనించవలసిన విషయం.

రసమయి, సాహిత్య సందినులు జీవితం చాలా చిత్రంగా తయారయింది. ఏ ఇతర కార్యక్రమం వచ్చినా ఆ సమయానికి, అవి కొట్టుకుపోతాయి. డిసెంబరు ఉత్తరార్ధం అంతా వీటికోగతే దాదాపు పుట్టింది. సంగీతోత్సవాలు ప్రసారంచేయ కూడదనికాదు. వారాని కొకసారివచ్చే వీటికోసం ఓ పావుగంట వాటిని ప్రసారంచేయడం మానేస్తే మునిగే కొంప ఏదీ లేదు. వాటికోసం ఎదిరిచూచే శ్రోతలు అవి లేకపోయేసరికి చాలా నిరుత్సాహపడతారు. అదీ కాక ఈమధ్యకాలాన ఉత్తమసాహిత్య కార్యక్రమంద్వారా శ్రోతలు వినలేక పోతున్నారు. ఆకాశవాణి కార్యక్రమాలు ప్రకటించే 'వాణి' ఉందిగదా! అందులో ఈకార్యక్రమాల వివరాలు దాదాపుఉండవు. ముఖ్యంగా హైద్రాబాదునుండి, మద్రాసు నుండి ప్రసారమయ్యే సందర్భాల్లో. అంటే ఆ పత్రిక ప్రకటింపబడేనాటికి విషయమూ, ప్రసంగించేవారూ నిర్ణయింపబడరన్నమాట. అప్పటికప్పుడు ఎవర్నో ఒకర్ని పట్టుకొని వ్రాయిస్తారు. ప్రసారం చేస్తారు. అల్లా వ్రాయించిందే కావచ్చు, పందొమ్మిది రెండల అరవై జనవరి పదకొండో తేదీన మద్రాసు

నుంచి ఎన్. భక్తవత్సలంగారి 'సత్కీరుని కవితాభిమానం' అన్న ప్రసంగం ప్రసారం చేయబడింది. కాళహస్తీశ్వర మహాత్మ్యంలోని కథ చెప్పారు. అందులో అధ్యాయాలున్నాయిట. మొత్తంమీద, కథ తీసేస్తే, ప్రసంగాలు పది వాక్యాలుండవచ్చు. దాదాపు నాల్గు నిమిషాలు పట్టొచ్చు. క్రమంగా 'రసమయి' 'నీరసమయి'గా తయారవుతోంది.

ఏడో జనవరిన అఖిలభారత సాహిత్య కార్యక్రమంలో 'మనుచరిత్ర' పరిచయ కార్యక్రమం హైదరాబాదునుండి ప్రసారం అయింది. రచన, నిర్వహణ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు. దాదాపు పూర్వార్ధఘంట కథ 'భువనవిజయం'లో పెద్దనగారు చదివినట్లూ, అదికూడా అక్కడక్కడా అంతర్నాటకగా చెప్పించారు. బాగానేఉంది. తరువాత విచారం ప్రారంభించారు. ఈ కార్యక్రమంమేరకు ఏ గ్రంథాన్ని ఇతర భాషీయులు ప్రసారం చేసినా, ఆ గ్రంథాన్ని బాగా అధ్యయనం చేసిన పెద్దల అభిప్రాయాల్ని ఉటంకించే వారు. అది శ్రోతలకు ఆ గ్రంథాన్నిగూర్చి ఆసక్తి కల్గచేసేపద్ధతి. తెలుగులో ఆ పద్ధతి వదలి విచారిద్దామా అని మొదలెట్టారు. ఈ విచారంలో పాల్గొన్నవారు గ్రంథాన్ని గూర్చి ఏ పరిశీలనా, అధ్యయనం చేసినట్లు తెలుగువారికి తెలియదు. ఆ పాల్గొన్న ముగ్గురికి అన్యవిధంగా 'పేరు' ఉండవచ్చు. మనుచరిత్ర విషయంలో మాత్రంలేదు. ఆ గ్రంథాన్నిగూర్చి పరిశోధనచేసిన చాలా మంది పెద్దలు దేశంలో ఉన్నారు. ఎవరి అభిప్రాయమూ వారిదిగా స్వీకరించ లేదు. వారి పేర్లు స్వీకరించకుండా తమవన్నట్లు చెప్పారు. అసలీ విచారం ఎందుకు. అది పరిచయ కార్యక్రమం. విచార కార్యక్రమంగానీ, చర్చా కార్యక్రమంగానీ కాదు. కావ్యం చదివితే గాని, అందులో రసాభాసం ఉందా లేదా అనేది తెలుస్తుంది. కాని పరిచయంలో శ్రోతను ఇబ్బందిపెట్టే ఈ చర్చ రసాభాస అయింది. ఆకాశవాణివారు-ఆంధ్ర నిర్వాహకులు – తమలో తాము గుడుగుడు గుంచీ లాడుతూ, అన్యత్ర తెలుగువారి ప్రశస్తికి భంగం కల్గిస్తున్నారు. ఇది సంకుచిత తత్వాన్ని తెల్పుతుందిగాని, గౌరవం కలిగించదు.

అప్పుడప్పుడు లలిత సంగీతం మరీ ఘోరంగా ఉంటోంది. ఆవూరి ఆసామి పావలా ఇస్తానని ఎగ్గొట్టాడనీ, వీడిది ఎగ్గొట్టాడనీ, రంకు టాలి భావాలను, ఏదో ఉత్తమ జానపద సాహిత్యంగా భావించి, గ్రామ్‌ఫోన్ రికార్డులుగా చేయించి ప్రసారం చేయడం ఆకాశవాణి వారి లలితసంగీత రసజ్ఞత ఎంతవరకు ఉందో తెలుస్తుంది. జనవరి తొమ్మిదో తేదీన విజయవాడ సుగమ సంగీత పేర ప్రసారం చేసిన గీతాలువింటే, ఆ గీతాలు రాసిన మహానుభావు లెవరోగాని, వాటికి సాహిత్యం అక్కర లేదనీ, విలువ ఉండనే వీల్లేదన్నట్లు, ఆకాశవాణి వారితో సహా నిర్ణయించారు. సాహిత్యం అల్లా చెడగొడుతున్నారు గదా ఆకాశవాణివారు. సంగీతాన్నీ చెడగొడుతున్నారు. ఫలపక్షం లేకుండా...నిర్వాహకులు శ్రద్ధ వహించి, తమ విధిని ప్రసారాల విషయంలో సక్రమంగా నెరవేర్చుకోవాలి.

— సామీరి.

# పుస్తకసమీక్ష

• రామకృష్ణుని జీవిత చరిత్ర:- రచయిత, ప్రకాశకుడు- శ్రీ చిరంతనానందస్వామి, భీమవరము.

ఇది సాహిత్య అకాడమీ వారిచే ఐదు వేల రూపాయల బహుమానము నందిన గ్రంథము. మొదటినుండియు తెలుగు గ్రంథములకు సాహిత్య అకాడమీవారి బహుమాన ప్రదానము నిష్పాక్షికముగా జరుగుట లేదని ఒక యభిప్రాయము దేశములో లేకపోలేదు. ఆ యభిప్రాయము తప్పు అనుటకు కూడ వీలులేదు. అట్టియభిప్రాయము జనులలో కలిగియుండుటకు కారణ మా సంస్థయే అని చెప్పవలసి వచ్చుచున్నది.

ఇట్టి సంస్థలకు అధికారిక దృష్టికన్న ప్రజా దృష్టి యధికముగా నుండుట యవసరము. అది ఒక్క యీ సంస్థకేకాదు. దేశములో ఏ సంస్థకును ఉన్నట్లు కనబడుట లేదు. సారె సారెకు బాధ్యతా రహితముగా ప్రవర్తించుచున్న సంస్థ అప్పుడప్పు డుచితముగా ప్రవర్తించినను ఆ ప్రవర్తనలోని ఔచిత్యము చప్పున జనుల మనస్సును పట్టుకోజాలదు. తమ విధులను సక్రమముగా నెరవేర్చని ఇటువంటి సంస్థలచే బహుమానము నందుటయే అప్పుడప్పు డపకీర్తి హేతువు కావచ్చును. అందుచేత ఈ గ్రంథమునుగూర్చిన సమీక్ష బహుమానముమాట మరచి స్వతంత్రముగా కొనసాగవలయును.

ఈ గ్రంథము ఆంధ్రవంగాంగ్ల భాషలలో వెలువడిన శ్రీరామకృష్ణ సంబంధములైన ప్రామాణిక గ్రంథములను పరిశీలించి వ్రాయబడినది. మహాపురుషుల జీవితచరిత్రను, వారి శిష్యులు వారి భక్తులు వ్రాయుటలో కొంత చిక్కున్నది. వివేకానందస్వామి యంతటివాడు శ్రీరామకృష్ణ పరమహంసను 'అవతార వరిష్ఠాయ రామకృష్ణాయ తేనమః' యని కీర్తించెను. రామకృష్ణుని ప్రభావము ఆయన శిష్యులమీద యెంత ప్రగాఢముగా నున్నదో పై శ్లోక పాదము తెలుపుచున్నది. ఈ గ్రంథ రచయితయైన చిరంతనానందస్వామి శ్రీరామకృష్ణుల శిష్యులైన విజ్ఞానానంద స్వాముల వారి శిష్యులు. అయినప్పటికిని వీరీ గ్రంథ ప్రస్తావనలో నిట్లు వ్రాసిరి. "దేనిని దెల్పినచో లేదా, అంగీకరించినచో తమ ఆరాధ్యవ్యక్తి యొక్క ఆజన్మ సిద్ధత్వమున కెక్కడ లోపమనిపించునో యని యనుయాయులు తెల్పుటకు సర్వసాధారణముగా వెనుదీయుచుందురో అట్టి కామము అహంకారము మున్నగువానిని శ్రీరామకృష్ణుడు ఎట్లు ఎదుర్కొనెనో, ఎట్లు నిర్జించెనో తెలుపు సంఘటనలను - సత్యాన్వేషకులగు సాధకులకు అత్యంతోపయుక్తమగు నిట్టి విషయములను - మూల గ్రంథములనుండి ప్రత్యేక శ్రద్ధతో వ్రాసి యున్నాము." ఈ పద్ధతి ప్రశంసనీయము.

శ్రీరామకృష్ణుని దివ్యజీవనములో బాల్యమాది నిర్యాణమువరకు శరీరమునకు రోమాంచము కల్గించు ఘట్టము లెన్నేని యున్నవి. గ్రంథరచనలో చేయితిరిగిన శ్రీ చిరంతనానందస్వామి ఆ యా ఘట్టముల రామణీయకమును బాగసుగా వర్ణించినారు. ఈ గ్రంథము చదివినవారు ఒక దివ్యభావావేశముచే కదలిపోవుట సహజము. దేనియందును విశ్వాసము లేని, తమ బ్రతుకునందు తమకే విశ్వాసము లేని నాస్తికుల సంగతి తెలియదు.

ఇంత దివ్యావేశ సంపన్నమైన ఈ పుస్తకమును గూర్చి లౌకికముగా మహాధికారములు సంపాదించిన కొందరు చేసిన ప్రశంసల కిందులో అధిక ప్రాముఖ్య మిచ్చుట అంత సబబుగా తోచుట లేదు. సాహిత్య అకాడమీ బహుమానముకూడ ఈ ప్రశంసల వంటిదే. ఈ బహుమాన విషయమున ప్రజాధనము దుర్వ్యయము కాలేదని మాత్రము అస్మాదృశులు సంతోషింపవచ్చును.

— 'సిద్ధార్థ'

♦ వేదవతి – కోటగిరి వేంకట కృష్ణారావు, గంపలగూడెం – కృష్ణాజిల్లా.

ఇది నాల్గంకముల నాటకం. కథ పురాణ ప్రసిద్ధమైనదే. వేదవతి కుశధ్వజ మహర్షి సంతానం పుట్టింది మొదలు హరిని తప్ప తదితరులను పెండ్లాడనని కూర్చున్నది. ఎందరో పిల్లనివ్వమని వస్తూఉండటం పోతూఉండటం, తండ్రి ససేమిరా అనటం, తుదకు దంభుడనే రాక్షసుడు కుశధ్వజుణ్ణి సంహరించటం జరిగింది. ఇది పూర్వకథ. వేదవతి తపస్సుకై అడవులకు వెళ్ళింది. అక్కడ రావణుడామెను దగ్గిస్తాడు. వాడు కాముకుడు. ఆమె అతణ్ణి శపించి చిచ్చులో దూకి దగ్ధమై పోవడమన్న విషయంగల ప్రథమాంకంతో బయలుదేరిన నాటకం సీతాకళ్యాణంతో అంతమౌతుంది.

నాటకము రావణుని ప్రవేశంతో ప్రారంభమై, ఆతని నిష్క్రమణతోనే అంతమౌతుంది. ఈ విధంగా ఒకే పాత్రతో ప్రారంభింపబడి అంతంచేయబడితే కథకొక కుదింపు వస్తుంది. ఇదొక శిల్పపురవ్వ. ఈ శిల్పం తిక్కనగారి గరుడోపాఖ్యానంలో ఉపయోగింప బడింది. తద్రహస్యాన్ని పట్టుకొని చేసిందేయిది.

పీఠికలో విశ్వనాథ సత్యనారాయణగారన్నట్లు ఈ కవి పద్యరచనా శిల్పాన్ని తెలిసికొని రచన చేస్తారు. రచనాశక్తి ప్రతి పద్యంలోనూ కన్పిస్తుంది.

తొలినుండి తుదిదాకా పాఠకునకు రావణుని పాత్ర కొట్టవచ్చినట్లు కన్పిస్తుంది. వాడు పరమ భక్తుడు.

"పుత్రమిత్ర కళత్రాది వ్యామోహమెంత నన్ను బీడించుచున్నను నంతర్వృత్త మేదో నీయెడ నాత్మీయతం బురికొల్పుచున్నది."

"ఆమె సాక్షాజ్జగజ్జననియె. ఉదయభాస్కరరశ్ములకై కందిపోవచ్చు" నన్నంత మహాభక్తుడు. శ్రీరాముడు పురుషోత్తముడన్న సంగతి తెలిసినవాడు. "రాముడన్న జగజ్జెట్టి త్రివిక్రముడే – నసంశయః" తెలిసి తెలిసి యాతని కవ్వించాడు. ఎందుకు చేసినట్లు? నాటకమంతా దానికి సమాధానంగా వ్రాయబడింది.

ఈ నాటకంలో ప్రతిచిన్న పాత్రా సొగసుగా దిద్దబడింది. 'చతుర్థాంక ప్రారంభంలో ఒక సేవకుడు మిథిలానగర సభలో రాజాసనాలమరుస్తూ అనుకుంటాడు. "శ్రీరాములవతారమూర్తులగుదురో కారో మా కేమి తెలియును? కాని మా సీతాదేవి మహాలక్ష్మియే." ఈ వాక్యంలో కవికున్న లోకజ్ఞత

వెల్లడౌతున్నది. మనకు నిత్యపరిచితమైన వస్తువుమీద అభిమానం దానిమీద ఆదరణ చూపటం నైజం. దానికన్నా గొప్పదున్న దిరా అంటే "ఉంటే ఉన్న దేమో కాని మా వస్తువా" అని లొట్టలువేయడం సహజం. సీత మహాలక్ష్మియే. కాని రాముడో- ఏమోనట. ఈ పరమముగ్ధములైన వాక్యాలు కవి లోకజ్ఞ తకు సాక్షీభూతాలు.

వృత్తాలేరుకోవటంలో ఈ కవికున్న చక్కని పరిజ్ఞానం నారదుని హరిస్తుతికై వాడిన సుందరీ వృత్తంలో ప్రస్ఫుట మౌతున్నది.

చతుర్థాంకంలోని రాజవంశావళి చెప్పే సందర్భంలో వశిష్ఠ విశ్వామిత్రుల మధ్య సంభాషణ పేలవముగా ఉన్నది. విశ్వా:- మహాత్మా! నీ వంతువచ్చినది. గొంతు సవరించుకొనుము - వశిష్ఠుడు:-నీవుమాత్రము తప్పించుకొందువా! రాజర్షి చంద్రమా! మొదలైనవి.

ఈ నెరసుల కేంగాని నాటకం చక్కగా ఉంది. రామాయణగాథ నెంతోమంది నాట కాలుగా మలిచారు కాని ఇట్లా రావణున్ని చూచి వ్రాసిందెవరూ లేరేమో వీరిని వదలి.

— తుమ్మపూడి కోటీశ్వరరావు.

♦ తిక్కన - వేముగంటి నరసింహాచార్యులు - వేంకటేశ్వర బుక్ డిపో, సిద్ధిపేట.

చారిత్రక విషయమును కావ్యవస్తువుగా గ్రహించి వ్రాయుట ఈ కాలమున ప్రఖ్యాతి గన్న మార్గము. ఈ మార్గమందు వచ్చిన కావ్యమే యీ తిక్కన,

మనుమసిద్ధి రాజ్యమును దాయాదు లప హరింపగా తిక్కన గణపతిదేవుని దర్శించుట కోరుగల్లు వెళ్ళి యచటనిని తన కవితచే మెప్పించి గణపతిదేవుని సహాయముతో మనుమ సిద్ధికి రాజ్యప్రదాన మొనర్చినట్లు సిద్ధేశ్వరచరిత్ర.

ఈ కథను యీ కవి నాల్గుల్లాసముల కావ్యముగా సంతరించినారు. ఓరుగల్లు వర్ణనతో కావ్య మారంభింపండి తిక్కన "నిత్య సచ్చిదానంద విలీనుడయ్యె" ననుటతో నంత మైనది.

పద్య రచనయందే కవి చేయితిరిగినవా డనుట కేపద్యమైనను సాక్ష్యమీయగలదు.

అటరెన్ చల్లని పిల్లగాడ్పులు దర
వ్యాకోచ పద్మావళీ
దళ గంధ స్పృశితంబులై ఉదయ
సంధ్యాలక్ష్మి పారాణిపూ
తలసింగారము లొల్కు పాదముల
మీదన్ బంగరుంజీర చిం
గులు జీరాడిన తీరునన్ మొలక
కల్గుల్ తోచె ప్రాచీదిశన్.

జాగసైన మాటలు కూర్పుతో ఒయ్యార ముగా ధారగా పద్యము సాగుచున్నది. చాల వరకు పద్యము లిట్లే సాగినవి.

ప్రథమోల్లాస మీ కావ్యమునకు మణి. కవిబ్రహ్మ సౌధ మొక సరస్వతీ పీఠము. అచటికి నిరంతరము "బుగ్గలమీది క్రొంబసిమి పొంగులుజారని లేతప్రాయపున్ మొగ్గలు విచ్చుబాలకవి ముఖ్యులనేకులు" వచ్చి కవిబ్రహ్మ శుభాశీస్సులనంది వెళ్ళు

చుందురట. నన్నయనుగూర్చి కవిచేసిన వర్ణనము సొగసైనది. ప్రత్యేకముగా నా సీసమందలి మూడవపాదము మిక్కిలి రమణీయమైనది. "శిలలలో నిదురించు తెలుగు కావ్యరమును మేలుకొలిపిన వైతాళికుండు" నన్నయ్యకు పూర్వము కావ్యములేదు. లేకుండునా యనువారి వాదమున కీ కవి వ్యతిరేకి వలెనున్నాడు. శిలలలో శాసనపంక్తులలో నున్నది. దానిని మేల్కొలిపిన వాడీ మహానుభావుడు.

వ్రాపెడివాని ముంజేతికి మీసమే యుండవలయునుగానిపద్య మెట్లైనను వ్రాయవచ్చును. పద్య మిట్లే యెందుకు వ్రాయవలయును? అట్లే ఎందుకు వ్రాయరాదు? సమాస మెందుకు? ఆ పాదమట్లే ఏల సాగవలయును? ఈ విషయము లీ కవికి తెలియుననుట కీ పద్యములు సాక్ష్యమిచ్చుచున్నవి. తిక్కనకు హరిహరనాథుడు సాక్షాత్కరించినాడు. ఆ వర్ణనమిట్లు చిందులాడినది.

ఒకవంక నెలవంక చికిలి వెన్నెలగాయ
కౌస్తుభ రత్న మొక్క దెస మెరయ
నాభిపంకజ మరందము జారనొక్కెడ
గంగమ్మ ఒకచాయ పొంగులెత్త

ప్రథమపాద ప్రథమార్థమందు శివుడు, రెండవ సగమందు విష్ణువు. ద్వితీయ ప్రథమార్థమందు హరి, మిగిలిన సగమందు హరుడు. రెండవపాదము మొదటిదానివలె లేదు. దానిని తిరుగవేసి వ్రాసినది. ఆ కవి బ్రహ్మకు హరిహరులన్న భేదములేదు. ఆ యిద్దరు నొకటే. ఈ విషయమునకు వ్యంజకముగా నా పద్యమట్లుగా తీర్చబడినది.

మాటలో మాటగా నీ కవికి కందము చాల హొయలు గ్రక్కుచు నడచుట దర్శనీయము.

ప్రాతశ్శీతల కోమల
వాతాంకురపాళి విసరివలగొనిన విధం
బాతరి నెల్లూరన్ నవ
చైతన్య ప్రాప్తి చల్లచల్లగసాగెన్.

చాలమంది కవులలో వస్తు నిర్వహణమునకు వర్ణనలకు సంబంధముండదు. ఈ కవికి కూడ నా దోషము తప్పలేదు. తిక్కన స్వప్నమునుండి మేల్కొనినాడు. తెల్లవారినది. ఆయుషస్సు ఐదారు పద్యములతో వర్ణింపబడినది. కథకు దానికి నేమి సంబంధము? అట్లే తిక్కన ఓరుగల్లునకు పయనించుచు మధ్యకృష్ణను దర్శించును. దాని వర్ణనకు పదునేను పద్యములు. ఇదియు తిక్కన వేయి స్తంభాలగుడిని చూచి చేసిన వర్ణనమును కథలో ననవసరమైనవి. కొన్ని వాక్కులు తిక్కన నోటినుండి వచ్చిన వనిపించుటలేదు. ఎవరో యాధునిక కవి మాట్లాడినట్లున్నవి. ఈ కథ కివి లగింపవు. విడిగా పత్రికలలో వేసినచో బాగుండును.

ఆధునిక ఖండకావ్యములలో మాత్రమే యుండదగిన కొన్ని మాటలు, అర్థములేనివి, ఇందున్నవి.

విషాదపున్ మోదుగపూచుట, తీపులు పూయుట, పిల్లనగ్రోవి నూదుట, గొంతు సవరింతున్, ఇత్యాదులు పేలవములైన వింద తిక్కన నోటితో ననిపించ గూడదు.

అందుకును ముష్టామష్టియని వాడుచుం డగా ముష్టీముష్టియని వాడి తనకు చక్కని శబ్దజ్ఞాన మున్నదని నిరూపించుకొనిన ఈ కవి పై వానిని వ్రాయుట బాగుండలేదు.

ఈ దోషము లన్నిటిని మ్రింగివేయ గలిగి నది కావ్యాంతము. కావ్యాంతమును పరమ రమణీయముగా చేసినా డీ కవి. మంగళాం తాని యన్న ప్రానుడిని సార్థక పరచునట్లుగా నున్నది. భారతరచన పూర్తి గావించి యా మహాకవి

'హరిహర బ్రహ్మ తేజోంశు మాణిక్య
దర్పణములో స్వస్వరూపంబు గనుచు
నిత్య సచ్చిదానంద లీలావిలీనుడయ్యె'

ఉదాత్తముగా కావ్యము పరిసమాప్త మైనది.

— తుమ్మపూడి కోటీశ్వరరావు.

ఆధునిక సాహిత్యగతిని సూచించే
హిందీ మాసపత్రిక :

# 'కల్పన'

నవ్య కవితా రీతులు
కథలు
సాహిత్య విమర్శలు
ఆధునిక సాహిత్య సమస్యలపై
విశేష చర్చలు.

కార్యాలయము :

**516,** సుల్తాన్‌బజారు
హైదరాబాద్.

